భారతీయ సాహిత్య నిర్మాతలు

# ఉ. వే. స్వామినాథ అయ్యరు

ఆంగ్ల మూలం

ప్రేమానందకుమార్

[కి. వా. జగన్నాథన్ తమిళ మూలం ఆధారంగా]

తెలుగు సేత

చల్లా రాధాకృష్ణశర్మ



సాహిత్య అకాడెమి

U. V. Swaminatha Iyer — Telugu Translation by C. R. Sarma of K. V. Jagannathan's monograph in Tamil, Sahitya Akademi, New Delhi. (1989) Rs.5.


First Published : 1989

సాహిత్య అకాడెమి
ప్రధాన కార్యాలయం :
రవీంద్ర భవన్, న్యూఢిల్లీ - 110 001
విక్రయ విభాగం : 'స్వాతి', మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001.

ప్రాంతీయ కార్యాలయాలు :
29, ఎల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాసు - 600 018
బ్లాక్ V - బి, రవీంద్ర స్టేడియమ్, కలకత్తా - 700 029
172, ముంబయి మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్,
బొంబాయి - 400 014.

రూ.5

Sri Krishna Chitra Printers, Madras-17.

అట్టలోపలి వైపున అచ్చు వేసిన శిల్ప చిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు, గౌతమబుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవికన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది.

— నాగార్జునకొండ క్రీ. శ. 2వ శతాబ్దం.
— జాతీయ పురావస్తుశాల, న్యూఢిల్లీ వారి సౌజన్యం.

# మున్నుడి

గత శతాబ్ది ఉత్తరార్థంలో ప్రభవించి ఈ శతాబ్దిలో కాలధర్మం చెందిన ఇద్దరు విద్వాంసులు తమిళ సాహిత్య సేవ చేసి చిరస్మరణీయులయ్యారు. ఒకరు మహాకవి సుబ్రహ్మణ్య భారతి, మరొకరు మహామహోపాధ్యాయ డాక్టర్ ఉ. వే. స్వామినాథ అయ్యరుగారు. భారతి అమృతమైన కవితలచే తమిళ తల్లిని అలంకరించారు. అయ్యరుగారేమో రెండు వేల సంవత్సరాల నాటి సంగ కావ్యాలను ఇతర ప్రాచీన కావ్యాలను వెలికి తీసి, పరిశోధిత ప్రచురణలు ప్రచురించారు. ఈ కావ్యాల వలన, తమిళుల ప్రాచీన చరిత్రను సంస్కృతినీ ప్రపంచం తెలుసుకోగలిగింది. వాటిచే విభిన్న దేశాల విద్వాంసులు ఆకర్షితులై తమిళ పరిశోధనలో నిమగ్నులయ్యారు. తత్ఫలితంగా అంతర్జాతీయ తమిళ మహా సభలు జరిగాయి; భవిష్యత్తులోనూ జరుగుతాయి.

కంబరామాయణం, విల్లిపుత్తూరార్ వ్రాసిన భారతం వంటి గ్రంథాలతో నిలిచిపోయిన తమిళ సాహిత్యం విస్తృతి చెందింది. అందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. ప్రాచీన తమిళుల సంస్కృతిని ప్రశంసించసాగారు. సంగకాలపు కృతులు అతి ప్రాచీనములే అయినా, నేటికీ అవి పఠన యోగ్యములై ఉన్నాయి.

సంగ కావ్యాలను వెలికి తీసిన అయ్యరుగారు పెక్కు వచన రచనలు వెలయించారు. తాము ప్రకటించిన మణిమేకలైకి అనుబంధంగా ఆయన మణిమేకలై కథా సంగ్రహం, త్రిరత్నాలైన బుద్ధుడు, సంఘం, ధర్మం, గురించి కూడా వ్రాశారు. పెరుంగదై (బృహత్కథ) పరిష్కరణ భాగంగా ఉదయన చరిత్ర వ్రాశారు.

తమ గురువుగారయిన మహావిద్వాన్ మీనాక్షి సుందరం పిళ్ళై, మరి ఇతరుల జీవిత చరిత్రలు ఆయన వ్రాశారు. తాళపత్రప్రతుల కోసం గాలించినప్పుడు కలిగిన అనుభవాలను కూడా ఆయన గ్రంథస్థం చేశారు. సంగం కృతులలోని ఉదంతాలను గూర్చి వ్యాసాలు రచించారు. పరిష్కరణ చేసిన కావ్యాలకు ఆయన వ్రాసిన ఉపోద్ఘాతాలు ఆయన ప్రశస్త వచన రచనకు నికషోపలాలు. ఈ వివిధ రచనలూ తమిళ సాహిత్య విజ్ఞాన సర్వస్వం.

గ్రంథ పరిష్కరణ, జీవిత చరిత్ర రచన, పరిశోధన, వ్యాసోపన్యాస వివేచన మొదలైన వాటిలో నిష్ణాతులైన అయ్యరుగారు 1942, ఏప్రిల్‌లో 88వ యేట కైవశం చెందారు. బాల్యం నుంచీ తమిళం అభ్యసించీ, ఇతరులకు తమిళం బోధించీ ప్రాచీన కావ్యాల పరిష్కరణలు ప్రచురించీ సాహిత్యసేవ చేసిన ఆయన జీవితం ఎన్నో అమూల్య విషయాలకు ఆధారం.

ఆ ప్రముఖ విద్వాంసుని జీవిత సంగ్రహమే యీ పుస్తకం. ఆయన జీవితంలో విద్యాభ్యాసం, అధ్యాపకత్వం, గ్రంథ పరిష్కరణం, గ్రంథ రచన మొదలైనవి కొన్ని ఘట్టాలు. వాటిలోని ప్రధాన విషయాలను నేను పేర్కొన్నాను. ఆయన వచన రచన గురించి కూడా వివరించాను.

అయ్యరుగారిని సుబ్రహ్మణ్య భారతి యిలా ప్రస్తుతించారు.

"తమిళ భాష మనినంత కాలం
తెలుస్తుంది నీకు కవుల ప్రశంస
లభిస్తుంది నీకు వారి కృతజ్ఞత
చిరంజీవివయ్యా నీవు !

నిజం. ఆ మహా విద్వాంసుడు చిరంజీవి. తమిళ భాష మనినంత కాలం ఆయన కీర్తి తరగదు.

4-11-82

కి. వా. జగన్నాథన్

# విషయ సూచిక

# 1

# తమిళ తాత

గత శతాబ్ది ఉత్తరార్ధంలోనూ ఈ శతాబ్ది ప్రారంభంలోనూ తమిళ తల్లికి మహనీయు లిద్దరు గణనీయమైన సేవ చేశారు. వారిలో ఒకరు ఆమె ప్రాచీనాభరణాలైన సంగ సాహిత్య కృతుల్ని వెలికి తీసి, వాటిని చక్కగా పరిష్కరించి మాతృ మూర్తిని కై సేయగా, మరొకరు నూతన కావ్యభూషణాలతో ఆమెను అలంకరించారు. మొదటివారు నా గురుదేవులు మహా మహోపాధ్యాయులు డాక్టర్ ఉ. వే. స్వామి నాథయ్యరు, తరువాతి వారు సుబ్రహ్మణ్య భారతి. అయ్యరుగారి నిర్విరామకృషి ఫలితంగా జీవక చింతామణి కావ్యం ప్రప్రథమంగా ప్రచురించబడింది. ఆ తర్వాత, పత్తుప్పాట్టు బౌద్ధ కావ్యమైన మణిమేకలై మొదలైనవి వెలుగుచూశాయి. ఎట్టుత్తొగైకి చెందిన అయిదు కావ్యాలను ఆయన పరిష్కరించారు. ఆయనచే ఉత్తేజితులై కొందరు ప్రాచీన తమిళ శాశదళ గ్రంథాలను పరిశీలించి ప్రామాణికములైన పరిష్కరణలు వెలువరించడానికి ప్రయత్నించారు.

ఈ ప్రాచీన గ్రంథ ప్రకటన వల్ల తమిళ సాహిత్యంలో పునరుజ్జీవనం ఏర్పడింది. రెండు వేల సంవత్సరాలకు పూర్వం నివసించిన తమిళుల చరిత్ర, సంస్కృతి, జీవన విధానం మొదలైన వాటిని గ్రహించడానికి ఈ ప్రాచీన కావ్యాలు అమూల్య సాధనాలు అయినాయి. కాగా, ప్రపంచంలోని విద్వాంసులు విస్మితులై సంగకాలపు కృతుల్ని సవిమర్శకంగా పరిశీలించడానికి పూనుకున్నారు. అతి ప్రాచీన కాలంలో సంతరించబడిన యిలాంటి రచనలు సర్వ సాధారణంగా పుస్తక ప్రదర్శనలలో కనిపిస్తాయి. కాని యివి బహు విషయ సంభరితాలు రెండు వేల సంవత్సరాల నాటివైనా, యీ కృతుల్ని ఆధారంగా చేసుకుని శతాబ్దుల వారీగా తమిళులకు సంబంధించిన చారిత్రక సాంఘిక విషయాలను గ్రహించవచ్చు. అయ్యరుగారి పరిష్కరణలు వెలుగులోకి రాగానే తరువాతి కాలపు కంబరామాయణాది కావ్యాలతోపాటు ఈ సంగకాలపు కృతులు కూడా ప్రచుర ప్రచారం గడించాయి. తత్ఫలితంగా తమిళ భాషా సాహిత్యాల పుట్టు పూర్వోత్తరాలు, చరిత్ర మొదలైన వాటిని తెలుసుకోవాలనే

తపన కలగడంతో అంతర్జాతీయ సదస్సులు, సభలు నిర్వహించబడ్డాయి. వైభవో పేతమైన తమిళ భాషా చరిత్రలో నవయుగం ప్రారంభమయింది.

ఈ నవయుగానికి స్వామినాథయ్యరు కారణభూతుడు. జీవితాంతమూ ఆయన ఉత్సాహంగా పని చేశారు. ఆయన తన ఎనభై యేడవ యేట దివంగతులయ్యారు అప్పటికి తమిళ సాహిత్యం కూడా బలం పుంజుకుంది. వివిధ స్థాయిలలోను స్థిర పడింది అయ్యరుగారి బాల్య యౌవనాలలో స్వప్నప్రాయంగా గోచరించింది. ఇపకు యధార్థంగా పర్యవసించింది. చారిత్రక పురుషులైన పారి, అది కామన్ ప్రభృతులు కేవలం నామమాత్రావశిష్టులు కాలేదు. వారి వీరోచిత కృత్యాలు, దయా సహిత చర్యలు పాఠశాలా విద్యార్థులకు కూడా తెలియవచ్చాయి. సాహిత్య విమర్శకులు ఈ ప్రాచీన కావ్యాలు ఉదాత్త కవితా సంపుటాలని గుర్తించారు. శ్రద్ధా సక్తులతో సంగసాహిత్యాధ్యయనం చెయ్యసాగారు సామాన్య పాఠకుడికి వాటిలోని విశేషాంశాలను తెలియజేయసాగారు. ఆ విధంగా ఎక్కడో ఒక మూలను ఒదిగి వున్న కావ్యాలు నలుగురికీ పరిచితము లయినాయి నిజంగానే తమిళుడు తన ఉదాత్త వారసత్వాన్ని కనుగొన గలిగాడు.

# 2
# చదువు సంధ్యలు

ఒక తంజావూరి పాలకుడు నలభై యెనిమిది మంది బ్రాహ్మణులకు ఉత్తమ దానపురాన్ని దానంగా యిచ్చాడు. సాంప్రదాయకమైన విద్వత్తు, మేధాసంపద ఆ గ్రామస్థులకు ఉగ్గుతో అబ్బవడ్డాయి. 19 వ శతాబ్ది ప్రారంభంలో ఆ గ్రామంలో వెంకటాచల అయ్యరనే ఒక పేద ఉపాధ్యాయుడు నివసించేవాడు. ఆయన శైవ బ్రాహ్మణుడు; అష్టసహస్రశాఖకు చెందినవాడు. ఆయనకి వేంకటసుబ్బయ్యరు, శ్రీనివాసయ్యరు అనే యిద్దరు కుమారులు. వేంకటసుబ్బయ్యరుకి 1855, ఫిబ్రవరి 19న స్వామినాథన్ అనే కుమారుడు జన్మించాడు.

భవిష్యత్తులో విద్వాంసుడుగా విఖ్యాతుడైన ఆయన తన తాతగారి వద్ద అక్షరాభ్యాసం చేశాడు; చాలా గీతాలు కూడా నేర్చుకున్నాడు. వేంకటసుబ్బయ్యరు మేనమామ అయిన ఘనం కృష్ణయ్యరు ప్రముఖ సంగీత విద్వాంసుడు. శాస్త్రీయ సంగీతంలోని మార్గత్రయాన్ని ఘనం నయం దేశికం అని వ్యవహరిస్తారు. అతి జటిలమని భావించబడే ఘనంలో ఆయన ఘటికుడు. ఆయన వద్ద వేంకటసుబ్బయ్యరు సంగీతం నేర్చుకుని అందులో ప్రావీణ్యం గడించాడు. తనలా స్వామినాథన్ కూడా సంగీతం నేర్చుకుని ప్రముఖుడవుతాడని తండ్రి ఆశించాడు. స్వామినాథన్‌కి సంగీత మంటే అభిరుచి లేకపోలేదు; కాని ఆయనకి మొదటి నుంచీ తమిళ మంటే ఎనలేని అభిమానం. నిజానికి తమిళం ఆయనకి ప్రాణానికి ప్రాణం.

వేంకటసుబ్బయ్యరు తన నివాసాన్ని అరియలూరుకి మార్చాడు. అక్కడ రామాయణం గురించి సంగీతోపన్యాసాలు చెయ్యసాగాడు. అదే ఆయన జీవిక. కాని రోజులు చాలా గడ్డుగా గడిచేవి. తనయుడు సంగీత సాహిత్యాలలో అభినివేశం కలవాడు కనక, అతను తన వృత్తిని చేపట్టి బాగా ధనార్జన చేయగలడని తండ్రి ఆశించాడు. కొడుకుని సంస్కృతంలోనూ సంగీతంలోనూ సమప్రజ్ఞగల స్వామి నాథయ్యరనే ఆయన వద్ద శిష్యుడుగా చేర్పించాడు. ఆయన తన శిష్యుడికి ఏవో కొన్ని లఘుసంస్కృత కావ్యాలు బోధించాడు. మేనమామ కూడా సంగీతంలోనూ, సంస్కృతంలోనూ శిక్షణ యివ్వసాగాడు. స్వామినాథన్ చిత్రలేఖనంలోనూ కృషి చేసేవాడు. ఎంతో సమర్థంగా కాగిత బొమ్మలు తయారు చేసేవాడు. భావుకుడు కూడా అందుకు సంస్కృత సాహిత్యాధ్యయనం తోడయింది తత్ఫలితంగా కావేరీ తీరపు మారుమూల గ్రామాల ప్రకృతి రమణీయకాన్ని దర్శించి ముగ్ధుడయ్యేవాడు.

ఆయన మాతామహుడైన కృష్ణశాస్త్రి ప్రముఖ శివభక్తుడు. మనవడి చేత శివనామం జపింపజేసేవాడు. చివరికది అలవాటుగా మారిపోయింది. విరామం లభించి నప్పుడల్లా నామజపం చేసేవాడు.

ఆనాళ్ళలో తమిళులు తమ మాతృభాషను చిన్నచూపు చూసేవారు. జీవితంలో విజయానికి ఆంగ్లభాష రాజబాటగా ఉండేది. అందువల్ల స్వామినాధన్‌కి ఇంగ్లీషు నేర్పించాలి. కాని ఆయనకా విదేశ భాషలో ఏ మాత్రమూ శ్రద్ధాసక్తులు వుండేవి కావు. శాస్త్రీయ సంగీతంలో శిక్షణ పొందేవారు, తెలుగులో కూడా తగినంత పరిచయం కలిగి వుండడం సంప్రదాయంగా వుండేది. కాని తెలుగు కూడా ఆయన్ని ఆకర్షించలేదు.

తమిళ భాషాభిమానం ఆయనకి బాల్యంలోనే కలిగింది. గోపాలకృష్ణభారతి రచించిన ప్రసిద్ధ యక్షగానం, నందనార్ చరిత్రం ఆయన్ని బహుధా ఆకర్షించింది. అందులోని పాటలు ఇంచుమించు అన్నీ ఆయనకి కంఠస్థము లయినాయి బుద్ధి పుట్టి నప్పుడల్లా వాటిని పాడేవాడు అరియలూరులో వున్న శఠగోప అయ్యంగారుతో ఆయనకి పరిచయం ఏర్పడింది. కవీ గాయకుడూ అయిన అయ్యంగారు ఆయనకి తమిళం బోధించసాగాడు. కంబరామాయణాన్ని క్షుణ్ణంగా చదివినవాడు కావడం వల్ల అయ్యంగారు జటిల తమిళ పద్యాలను సైతం రసవత్తరంగా బోధించేవాడు. గురువుగారి వల్ల యువ విద్యార్థికి తమిళ మంటే తీరని అభిమానం కలిగించి

స్వామినాథన్‌కి ఏడో యేట ఉపనయనం జరిగింది. ఆ సందర్భంగా అతనికి వెంకటరామశర్మ అనే పేరు పెట్టబడింది. కాని అతన్ని అందరూ శామా అని పిలిచే వారు. అది స్వామినాథన్‌కి సంక్షిప్తనామం. తిరువేరగంలో వేంచేసి వున్న స్వామి వారి పేరు స్వామినాధన్. మేనమామ శివరామయ్యరు నుంచి కొన్ని మంత్రాలు నేర్చుకున్నాడు సంధ్యావందనం నియతిగా చేసేవాడు.

ఇంతలో వేంకటసుబ్బయ్యరు తన నివాసాన్ని కున్నం అనే దగ్గరి గ్రామానికి మార్చాడు. ఆ గ్రామస్థులు ఆయన చేసే సంగీతోపన్యాసాలకు సముచిత మైన పారితోషికం ముట్టజెపుతామని వాగ్దానం చేశారు. ఆ గ్రామవాస్తవ్యులైన చిదంబరం పిళ్లై అయ్యరుకి తిరువిళైయాడల్ పురాణం మొదలైన తమిళ కావ్యాలు బోధించాడు. అయ్యరుగారి తమిళ భాషాభిమానం ఇప్పుడు మరీ ఎక్కువయింది తమిళ కావ్య రహస్యాలను వాటి అందచందాలను సహర్షంగా తెలియజేసే ఉపాధ్యా యులు లభించారు. వాళ్ళలో ఒకరు కిర్కుడి వాస్తవ్యులైన కస్తూరిరంగ అయ్యం గారు. ఆయన అయ్యరుకి నన్నూల్, నవనీత పాట్టియల్ మొదలైన లక్షణ గ్రంథాలు బోధించాడు. ఆ రోజుల్లో అయ్యరు తాయుమానవర్, పట్టిణత్తార్‌లను అనుకరిస్తూ సంప్రదాయ ఛందస్సులలో పద్యరచన చెయ్యసాగాడు. ఆ రచనలో చెప్పుకోదగిన మౌలికత లేకపోయినా, తమిళ పాండిత్య సముపార్జనకు అది దోహదం చేసింది

అలా అయ్యరు తమిళ సాహిత్యంతో ప్రగాఢమైన పరిచయం పొందుతున్న సమయంలో, ఆయనకి పెళ్ళి చెయ్యాలని తండ్రి అభిలషించాడు. 1868, జూన్ 16న అయ్యరుకి మధురాంబాళ్ అనే కన్యతో వివాహం జరిగింది. అందువలన ఆయన జీవిత విధానంలో ఎలాంటి మార్పు ఏర్పడలేదు. కుటుంబం ఇంకా ఆర్థిక

సమస్యల్లోనే వుంది. అయినా ఉద్యోగావకాశాలు కల్పించే ఆంగ్లవిద్యనుగాని సంగీత శాస్త్రాన్నిగాని అభ్యసించాలని ఆయన ఆశించలేదు. ఆయన స్వీయ చరిత్రలో ఇలా వ్రాసుకున్నాడు:

"వివాహం. ధనం, పర్యటన-వీటివల్ల నాకేమీ తృప్తి కలగలేదు. నాలో ఒకే ఒక తీరని వాంఛ. తమిళమే నా ధనం. అదే నాకు ఆహారం, అదే నా జ్ఞాన తృష్ణను తొలగించేది. తమిళ సాహిత్య పరిచయం ఎక్కువయ్యే కొద్దీ, సంతోషం సంతృప్తి నూతనోత్తేజం నాకు కలిగేవి. ఈ భావం జీవితాంతమూ వుండేది."

కొడుకులోని తమిళ విద్యా పిపాసను గుర్తించి, వేంకటసుబ్బయ్యరు అతన్ని చెంగన్నం వాస్తవ్యుడైన వృద్ధాచలంరెడ్డిగారి శిష్యుడిగా చేశాడు. రెడ్డిగారు మహా విద్వాంసులు ఆయన తన శిష్యులకు తమిళ ఛందశ్శాస్త్రగ్రంథమైన యాప్పరుంగల క్కారికైని బోధించేవాడు. ఆయన ప్రముఖ తమిళ విద్వాంసుల్ని గురించీ, ప్రసిద్ధ అధ్యాపకుల్ని గురించీ ఆయన తరుచుగా ప్రసంగించేవాడు. తిరువావుదురై మఠం ఆస్థాన విద్వాంసులైన మహావిద్వాన్ మీనాక్షిసుందరంపిళ్లై ప్రసక్తి వస్తే చాలు, రెడ్డిగారు తన్మయులయ్యేవారు. పిళ్లైగారి వద్ద శిష్యుడుగా చేరి, తమిళ సాహిత్య సుధను తనివితీర ఆస్వాదించాలనే తపన అయ్యరుకి కలిగింది. ఆయన తమిళ తృష్ణను తీర్చగల సమర్థుడు మహావిద్వాన్ పిళ్లై గారొక్కరే అని వేంకటసుబ్బయ్యరుకి మిత్రులు నచ్చచెప్పారు.

అయితే వేంకటసుబ్బయ్యరు సందిగ్ధావస్థలో పడ్డాడు. పిళ్లైగారేమో మాయూరంలో ఉన్నారు. తనయుడి చదువు కోసం ముక్కూ, మొగం తెలియని ఊళ్ళో నివాసం పెట్టడానికి సుబ్బయ్యరు తట పటాయించాడు. కాని ఆయనకి దైవానుగ్రహం మీద మహా నమ్మకం. ఆ మహా విద్వాంసుడు కనక అంగీకరిస్తే, తన కుమారుడు తప్పక ప్రముఖ తమిళ పండితుడు కాగలడన్న విశ్వాసం ఆయనకి వుంది. అదీగాక సుబ్బయ్యరు మిత్రుడైన గోపాలకృష్ణభారతి మాయూరంలోనే వున్నాడు. నందనార్ చరిత్ర గ్రంథకర్త అయిన భారతి తన కొడుక్కి శాస్త్రీయ సంగీతంలో శిక్షణ యివ్వగలడనీ ఆశించాడు. అందువల్ల మాయూరం వెళ్ళి పిళ్లై గారిని కలుసుకోవాలని ఆయన నిశ్చయించాడు.

# 3

# మీనాక్షి సుందరం పిళ్లై శిష్యుడు

మాయూరంలో తిరువాడుదురై మఠానికి చెందిన ఒక భవనానికి దగ్గర్లో మీనాక్షి సుందరంపిళ్లై నివసించేవాడు. తమిళంలో మహా విద్వాంసుడుగా ఆయన ప్రథిత యశస్కుడు. ఆయన ఎన్నో స్థల పురాణాలు రచించాడు. సేక్కిళార్‌పిళ్లై తమిళ్ అనే భక్తి కావ్యం వ్రాశాడు. తమిళ భాషా సాహిత్యాలు బోధించడంలో ఆయన దిట్ట, ఆదర్శ గురువు. సుబ్బయ్యరు కొడుకుని వెంటబెట్టుకుని పిళ్లైగారి యింటికి వెళ్ళాడు. వాళ్ళను కలుసుకోడానికి పిళ్లై యింట్లోంచి బయటికి వచ్చాడు. శివభక్తుడుగా గోచరిస్తున్న ఆయన్ని దర్శించగానే అయ్యరు మనో వీధిలో భక్తి భావం ఏర్పడింది. ఆ అనుభూతిని ఆయన యిలా అభివర్ణించాడు.

"ఆ మహా విద్వాంసుడు నా వైపు నడిచి వస్తుంటేనే ఆయన ఆకృతి నన్ను ఆకర్షించింది. ఆయన ఏనుగులా మెల్లగా గంభీరంగా నడిచి వచ్చారు. బలిష్ఠమైన దేహం, చిరుబొజ్జ, మోకాళ్ళ దాకా చేతులు, విశాలమైన ఫాలభాగం, చిన్న పిలక, శ్వేత వస్త్రధారి. ఆయన్ని చూడగానే సంపన్న గృహస్థుడుగా తోచాడు. కాని ఆయన ముఖంలో ధనికులలో కనిపించే దర్పం లేదు. ప్రశాంతత కనిపిస్తోంది. అలల హోరు తగ్గిన సముద్ర ప్రశాంతత అది. చూపులు నిశితంగా లేవు. అలా అని నిర్లక్ష్యపు చూపులనీ చెప్పలేము. దయార్ద్ర వీక్షణాలవి. ఆయనది మెల్లని నడక. జీవిత సమరంలో అలిసిపోయినట్లుగా ఒక భావం కనిపిస్తుంది. ఆయన ఆకృతి ఉత్తేజ పూరితం. ఆయనలో అలసత్వం ఆదుర్దా అవేమీ లేవు. రుద్రాక్షమాల కంఠసీమను అలంకరించింది. దీర్ఘ తపస్సుకి తర్వాత భగవద్దర్శనం కోసం తహ తహలాడే భక్తునిలా నేనున్నాను. అలాంటి భక్తునికి ఆయన దేవుడిలా కనిపించాడు. నా చూపులు ఆయన మీద కేంద్రీకృతము లయినాయి. నాలో ఉత్సాహపు తరంగాలు లేచాయి. తత్ఫలితంగా నా కళ్ళు అశ్రుపూరితము లయ్యాయి."

తనను తాను పరిచయం చేసుకున్న తర్వాత, వేంకటసుబ్బయ్యరు గోపాల కృష్ణభారతితో తనకు గల పరిచయాన్ని తెలియజేశాడు. అయ్యరుకి గల తమిళ

భాషాభిమానాన్ని వ్యక్తం చేశాడు. పిళ్లై సంతోషించాడు. అయ్యరుని పరీక్షించాడు. ఒక పద్యం చెప్పమన్నాడు. ప్రశ్న మీద ప్రశ్న వేసి ప్రత్యుత్తరాలు రప్పించాడు. సుబ్బయ్యరు పిళ్లైని ఉద్దేశించి, "ఈ పిల్లవాణ్ణి మీకు ఒప్పగిస్తున్నాను. శిష్యుడిగా స్వీకరించండి. ఎప్పటి నుంచీ పాఠాలు మొదలు పెట్టవచ్చు?" అని అడిగాడు.

ఆయన కొంచెం సేపు ఆలోచించి యిలా అన్నాడు. "చదువుకోవాలంటూ యిక్కడికి అప్పుడప్పుడు కొంత మంది వస్తూ వుంటారు. కొంత కాలమైన తర్వాత వెళ్ళిపోతారు. అయినా నా శిష్యులని వాళ్ళు చెప్పుకుంటారు. ఇలాంటి అరకొర చదువు వలన వాళ్ళకుగాని యితరులకు గాని లాభంలేదు. పైగా నాకూ తృప్తి వుండదు."

అప్పుడు సుబ్బయ్యరు అన్నాడు గదా, "మా అబ్బాయి అలాంటి రకం కాదు. మీరు ఉండమన్నంతవరకు మా అబ్బాయి మీ వద్దనే వుంటాడు, వాణ్ణి తమిళంలో సుశిక్షితుడ్ని చేసేందుకు మీ యిష్టం వచ్చినంత కాలం మీ వద్ద వుంచుకో వచ్చు. ప్రస్తుతం వాడికేమీ బాధ్యతలు లేవు."

పిళ్లైగారు సంతృప్తులయ్యారు. మాయూరంలో అయ్యరు నివసించేందుకు ఏమి ఏర్పాట్లు చేస్తున్నారని అడిగాడు. ఆ బాధ్యత కూడా ఆయనే వహించాలని సుబ్బయ్యరు పిళ్లైగారి సహాయాన్ని అర్థించాడు.

"నేను తిరువాడుదురైలోనూ పట్టీశ్వరంలోనూ ఉన్నంత కాలమూ మీ అబ్బాయికి తగిన భోజన సౌకర్యాలు కల్పిస్తాను. కాని యీ పట్టణంలో నా కీలాంటి శక్తిలేదు." అన్నాడు పిళ్లై.

ప్రతి నెలా పిల్లవాని కోసం కొంత డబ్బు పంపిస్తానని వేంకటసుబ్బయ్యరు హామీ యిచ్చాడు ఆ తర్వాత అయ్యరుని శిష్యుడిగా స్వీకరించడానికి పిళ్లై సమ్మతించాడు. పాఠాలు ప్రారంభించడానికి మంచిరోజు చూడమని కోరాడు. అయ్యరు సంతోషానికి మేరలేదు. ఆ విధంగా ఆయన జీవితంలోని రెండవ ప్రధాన ఘట్టం మొదలయింది.

పాఠాలు చెప్పడానికి పిళ్లై సహర్షంగా సమ్మతించినా, ఆయన ముఖతః పాఠాలు వినే భాగ్యం కొంత కాలం దాకా అయ్యరుకి లభించలేదు. అయ్యరుకి పాఠాలు చెప్పమని ఆయన పాత శిష్యులలో ఒకడైన సవేరినాథపిళ్లైని కోరాడు.

ఆయన మంచి వాడు; క్రైస్తవుడు. సవేరినాథపిళ్లై పండితుడే, చక్కగా పాఠాలు చెప్పేవాడు. అయినా గురుముఖతః పాఠాలు వినాలని అయ్యరు తహ తహ లాడి పోయాడు. అందుకు తగిన అవకాశం ఎపుడు వస్తుందా అని నిరీక్షించసాగాడు.

సహజకవి అయిన మీనాక్షి సుందరం పిళ్లై ప్రకృత్యుపాసకుడు. ఆయన తన పెరట్లో అప్పుడే సమూలంగా పెకలించిన చెట్లు నాటాడు. కొత్తగడ్డలో అవి ఎలా బతుకుతాయా అని ఆదుర్దా పడసాగాడు. కనక ప్రతిరోజూ ఉదయం ఆయన ఆ చెట్లని శ్రద్ధగా పరిశీలించేవాడు, చిగుళ్ళు వేశాయా అని. ఈ విషయాన్ని అయ్యరు గమనించాడు. ప్రతి రోజూ ఉషః కాలాన లేచి చెట్లని పరీక్షగా చూడసాగాడు; కొత్త చిగుళ్ళని గుర్తించేవాడు. పిళ్లై తోటలోకి రావడం తరువాత, ఆ చిగుళ్ళని ఆయనకి చూపించేవాడు. పిళ్లై ఎంతో తృప్తి చెందేవాడు, శిష్యుడ్ని మెచ్చుకునేవాడు. అయ్యరుతో మనసు విప్పి మాట్లాడేవాడు. ఒక రోజు ఏం పాఠం చదువుతున్నావని ప్రశ్నించాడు.

"నేను నైషడం (ధం) చదువుతున్నాను. ఈ కావ్యాన్ని తమరే చెబితే బాగుంటుంది" అన్నాడు సవినయంగా. ఆ రోజు నుంచీ మీనాక్షి సుందరం పిళ్లై అయ్యరుని తన శిష్యుడిగా చేసుకున్నాడు. స్వీయ రచన అయిన తిరుక్కుడన్దైయి తిరిపన్తాదిని ఆయన చెప్పడం మొదలు పెట్టాడు. అయ్యరుకి గల తమిళ భాషాభిమానం, సాహిత్య మర్మాలను అనాయాసంగా గ్రహించే శక్తి, విజాయితీ-మొదలైన వాటిని గుర్తించి పిళ్లై సంతృప్తి చెందాడు తదాదిగా చాలా గంటలు పాఠాలు చెప్పేవాడు, త్వర త్వరగాను చెప్పేవాడు. ఇదంతా అయ్యరుకి లభించిన విందు! ఆయన మాటనే పఠికిద్దాము.

"నాకు గల తమిళ తృష్ణ చాలా ఎక్కువ. ఇతరత్రా నేను పాఠాలు నేర్చుకునే టప్పుడు ఏనుగు ఆకలిని (దయ్యపు ఆకలి) గుప్పెడు మరమరాలతో తీర్చుకోడానికి ప్రయత్నించినట్టుగా వుండేది. నేను పిళ్లైగారి వద్ద చేరిన తర్వాత ఎంత ఆశ్చర్యం! నాకు విందు భోజనం లభించింది. అది నా ఆకలిని తీర్చింది. కొన్ని సందర్భాలలో అయితే ఆకలిని మించిన భోజనం లభించేది. ఇక తమిళ విద్యాభ్యాసానికి లోటులేదు అని నేను గుర్తించ గలిగాను."

ఆ మహా విద్వాంసుడి పాద సన్నిధిని అయ్యరు ఎన్నో కృతులు అధ్యయనం చేశాడు. వాటిలో చాలా అన్తాది, పిళ్లైత్తమిళ్ కృతులు ఉన్నాయి. మహా విద్వాన్

పిళ్లై ఆదర్శ గురువైతే, అయ్యరు ఆదర్శ శిష్యుడు. తమిళ భాషాభిమానంలో వాళ్ళిద్దరూ ఒక్కటే. ఒకరి కొకరు సన్నిహితం కావడం ఉభయతారక మయింది. పిళ్లై తన జీవిత ఫలమైన తమిళ భాషా పాండిత్యాన్ని శిష్యుడికి బోధించగా, ఆ పాండిత్య వర్షధారల్ని శిష్యుడు తనివి తీరా అనుభవించాడు. శ్రద్ధాసక్తులు గల శిష్యుడంటే గురువుకి ప్రత్యేకమైన అభిమానం. కాగా ఆ విద్వత్కవి అయ్యరుని గాఢంగా అభిమానించడంలో ఆశ్చర్యం లేదు.

# 4

# తిరువాడుదురైలో విద్యాభ్యాసం

ఒక నాడు పాఠం జరుగుతోంది. ఉన్నట్టుండి, "నీకు వెంకటరామన్ అని ఎందుకు పేరు పెట్టారు?" అని పిళ్లై అయ్యరుని అడిగాడు. మా యిలవేల్పు వేంక టేశ్వరుడు. ఆ స్వామి పేరే నాకు పెట్టారు – అని అయ్యరు బదులు చెప్పాడు. "నీకు మరో పేరు ఏదన్నా వుందా?" "నన్ను శామా అని పిలుస్తారు. అది స్వామినాథన్ కి సంక్షిప్తనామం" అన్నాడు అయ్యరు. ఆ పేరుతోనే నిన్ను పిలుస్తానని పిళ్లై అన్నాడు. ఆ విధంగా అయ్యరు అధికారిక నామం స్వామినాథన్ అయింది. ప్రియతమమైన యీ పేరుకే ఈ నాడు తమిళులు తమ జోహారులు అర్పిస్తున్నారు.

తండ్రి సూచించినట్లుగా, అయ్యరు ఉదయాలలో సంగీతం నేర్చుకునేందుకు గోపాలకృష్ణభారతి వద్దకు వెడుతూ వుండేవాడు. ఒక సారి తాము కలుసుకున్నప్పుడు ఈ విషయాన్ని భారతి పిళ్లైకి చెప్పాడు తర్వాత పిళ్లై అయ్యరుని అడిగాడు. అప్పుడాయన సవినయంగా ఇలా అన్నాడు; "నేనింతకు పూర్వం నేర్చుకున్నది మరిచిపోకుండా వుండేందుకుగాను మా నాన్నగారు భారతి వద్దకు వెడుతూ వుండ మన్నారు." కాని పిళ్లై ఉత్సాహం ప్రకటించలేదు. "సంగీత ప్రపంచంలో కనక ప్రవేశించినట్లయితే, సాహితీ వ్యాసంగానికి కావలసినంత శ్రద్ధ కుదరదు." అదీ పిళ్లైగారి వ్యాఖ్య.

సంగీతంలో పిళ్లైకి అభిరుచి లేదని అయ్యరు గ్రహించాడు. అదీకాక ఆయన మాటల్లో సత్యం లేకపోలేదనీ గ్రహించాడు. వెంటనే అయ్యరు భారతి యింటికి వెళ్ళి తన అశక్తతను తెలియజేశాడు. సరిగ్గా ఆ సమయాన ఆయన మళ్ళీ తమిళంలో కవిత్వం వ్రాస్తూ వుండేవాడు.

కొన్ని నెలల తర్వాత, అయ్యరు మీనాక్షిసుందరంపిళ్లైతో కలిసి తిరువాడుదురై వెళ్ళాడు ఆ సుప్రసిద్ధమఠానికి అప్పట్లో మేలకరం సుబ్రహ్మణ్య దేశికర్ అధిపతిగా ఉండేవాడు. ఆయన విద్వత్తునీ సచ్ఛీలాన్నీ చూసి ప్రజలు దేశికర్‌ని చాలా గౌరవించేవారు. మఠంలో తన గురువుకి లభించిన ఆదరాభిమానాలను స్వయంగా చూసి అయ్యరు ఎంతగానో సంతోషించాడు. పిళ్లై అందరితోను ప్రియోక్తులు పలికాడు. ఆయన పట్ల దేశికరుకి గల అభిమానం అనిర్వచనీయం. ఆయన్ని మఠంలో కొంత కాలం ఉండమని దేశికర్ అర్థించాడు. ఆధ్యాత్మిక సాధకు లయిన తంబిరాళ్ళకు పాఠాలు చెప్పమనీ అర్థించాడు. పిళ్లై తన శిష్యుడ్ని దేశికర్‌కి పరిచయం చేశాడు. ఒక పద్యం చదవమని దేశికరు అడగ్గానే, అయ్యరు రాగయుక్తంగా పద్యం చదివి, ప్రతి పదార్థం కూడా చెప్పాడు. దేశికర్ తృప్తి చెందాడు.

సుప్రసిద్ధ కవి అయిన త్రికూట రాజప్ప కవిరాయరు వంశానికి చెందినవాడు సుబ్రహ్మణ్య దేశికర్. అయ్యరు చెప్పిన పద్యం కవిరాయర్ రచించిన తిరుకూట యమక అన్తాదిలోది. పైగా ఆయన సంగీత ప్రియుడు. అందు వల్ల దేశికర్ సంతోషం ద్విగుణీకృతమయింది. విద్యారంగంలో ఆంగ్లభాషా వ్యామోహం మితిమీర వుండగా, అయ్యరుకి తమిళ సాహిత్యమంటే ప్రగాఢమైన అభిమానమని పిళ్లై దేశికరుకి తెలియజేశాడు. అందుకు ఆయన చాలా సంతోషించాడు

తిరువాడుదురై మఠంలో జరిగే శివార్చనా విధానం అయ్యరుని ఆశ్చర్య పరిచింది. దేశికర్ ఆధ్వర్యంలో వున్న ఆ మఠం చాలా గౌరవించబడేది. తంబిరానుల కేశపాశాలు దీర్ఘములు, కాషాయవస్త్రధారులు. వారు ధరించిన అరుకట్టి ఆభరణాలు, వారి సుందరమైన వేషధారణ ఆకట్టుకుంటాయి. కాషాయ వస్త్రధారులు చాలా మంది ఎవరి పనుల్లో వారు ఉండడం, ప్రతి తంబిరాను తన విద్యుక్తధర్మాన్ని తు. చ తప్పకుండ చెయ్యడంతో తిరువాడుదురై శైవానికి ప్రముఖ కేంద్రంగా కనిపించింది.

మఠంలో ఉన్నవారి కందరికీ పాఠాలు చెప్పవలసిందిగా దేశికర్ మరోసారి పిళ్లైని అర్థించాడు. ఆయన అక్కడ ఉండడం దేశికరుకి సంతోషప్రదమైన విషయం. అందుకు పిళ్లై అంగీకరించాడు. పట్టీశ్వరం వాస్తవ్యుడైన ఆరుముగత్త పిళ్లై అనే ఆయన మీనాక్షిసుందరంపిళ్లైని కొంత కాలం పాటు తమ గ్రామానికి పంపమని అర్థించాడు. దేశికర్ అందుకు సమ్మతించాడు.

తిరువావడుదుఱై నుంచి పట్టీశ్వరానికి వెళ్ళే దారిలో కుంభకోణం ప్రభుత్వ కళాశాలలో తమిళ పండితుడుగా పని చేసే త్యాగరాజు చె(సె)ట్టిగారిని అయ్యరు కలుసుకున్నాడు. చెట్టిగారు అధ్యాపకుడుగా ప్రసిద్ధి చెందారు. ఆయన్ని చూడగానే, ఆయనంటే సద్భావం కలిగింది అయ్యరుకి. ఆయన వాడి చూపులు, గంభీర భాషణం అయ్యరుకి నచ్చాయి. పైగా ఆయన సుందరుడు; దృఢగాత్రుడు. చెట్టిగారు అయ్యరుని చదువు సంధ్యల విషయమై ప్రశ్నలు వేసి, సదుత్తరాలు పొందాడు. మీరు ఇతరులకు పాఠాలు చెప్పగలరా?" అని ఆయన అడిగాడు. "నా శక్తివంచన లేకుండా నేను ప్రయత్నిస్తాను" అని అయ్యరు బదులు చెప్పాడు. ఆ తర్వాత వాళ్ళిద్దరి సంభాషణ పిళ్లైగారిని గురించి సాగింది. పిళ్లైగారి విద్యార్థి కావడమన్నది ప్రముఖ విషయమనీ, అందువల్ల ఎవరైనా ఆదర్శ అధ్యాపకుడు కావచ్చుననీ, కనుక ఒక్క క్షణమైనా వృధా చెయ్యక పాఠాల మీద శ్రద్ధ వహించాలనీ చెట్టిగారు అయ్యరుకి సలహా చెప్పారు.

పట్టీశ్వరం ప్రయాణం బహు విధాలుగా ఆసక్తిదాయక మయింది. అక్కడ ఉన్న రోజుల్లో ఆ పరిసరాలలో ఉన్న దేవాలయాలను అయ్యరు చూడగలిగాడు. గురు ముఖతః ఆయా దేవాలయాల చారిత్రక పురాణ విషయాలు తెలుసుకోగలిగాడు, నాగై, మాయూర పురాణాలు అధ్యయనం చేశాడు.

పట్టీశ్వరంలోని ఆరుముగత్త పిళ్లై యింటి పద్ధతులు కొంచెం విచిత్రంగా కనిపించాయి. రాత్రి తొమ్మిదింటికి అందరూ నిద్రపోవాలి. అర్ధరాత్రి పూట పిళ్లై లేచేవాడు, బంధువుల్నీ అతిథుల్నీ లేపి, భోజనానికి లెమ్మనే వాడు. మీనాక్షిసుందరం పిళ్లై వెంట వచ్చిన వారికి ఈ విచిత్ర పద్ధతి నచ్చలేదు, అయినా కిమ్మనలేదు. ఆరుముగత్త పిళ్లైది కొంచెం కఠిన స్వభావం. ఆయన ఆ పరిసరాలలో ప్రసిద్ధుడైన వ్యక్తి. అందువల్ల ఆయనకి అనిష్టంగా ఎవ్వరూ సంచరించరు. ఆయన ఎవ్వరినీ

ఆదర భావంతో చూడడు. కాని మీనాక్షిసుందరం పిళ్లై పట్ల చాలా అభిమానం అయ్యరు కూడా ఆరుముగత్త పిళ్లై పరిహాసానికి, కోపానికి పాత్రుడయ్యాడు.

పిళ్లైగారి ముఖ్య శిష్యులలో ప్రముఖుడైన సవేరినాథపిళ్లై తరుచుగా మాయూరం నుంచి వచ్చేవాడు. ధైర్యం చేసి అతను అర్ధరాత్రి భోజనాలకు అడ్డుమాన్ వేశాడు. ఆరుముగత్తపిళ్లైని ఉద్దేశించి అతను ఒక పద్యం చదివాడు. పట్టీశ్వరంలో రాత్రి వేళల్లో ఆకలితో బాధ పడమని ఆదేశించిన ఆ బ్రహ్మదేవుడు మమ్మల్ని చెట్లుగా పుట్టించలేదు – ఇదీ ఆ పద్యభావం. ఆ విధంగా నచ్చచెప్పి, అతిధులకు రాత్రి భోజనం సకాలంలో లభించేలా అతను చేశాడు సహ విద్యార్థులతన్ని బహుధా ప్రశంసించారు. అలా ఆరు నెలలు పట్టీశ్వరంలో గడిచాయి. ఆ రోజుల్లో తమిళనాడులోని ప్రధాన వ్యక్తుల్ని కలుసుకునే సదవకాశం అయ్యరుకి లభించింది. వివిధ మానవుల మనోభావాలు గ్రహించే అవకాశమూ లభించింది.

పట్టీశ్వరంలో ఉన్న రోజుల్లోనే, ఆయన స్వగ్రామమైన ఉత్తమదానపురానికి వెళ్ళాడు. ఆ రోజు సరస్వతీ పూజ. కాని విజయదశమినాడు గురుసన్నిధిన క్రొత్త కావ్యం అధ్యయనం చెయ్యాలనుకున్న అభిలాషతో, పట్టీశ్వరానికి తిరిగి వచ్చాడు. నైషధం ప్రారంభించాడు పిళ్లైగారిని ప్రప్రథమంగా దర్శించినప్పుడు, అయ్యరు నైషధం నుంచి పద్యం చదివాడు. మళ్ళీ మహావిద్వాన్ చరణసన్నిధిని నైషధ కావ్యాన్ని అధ్యయనం చెయ్యసాగాడు.

పట్టీశ్వరంలో ఉన్న చివరిరోజుల్లో అయ్యరు కోట్టూరు వెళ్ళాడు. అక్కడ ఆయన తల్లిదండ్రులు నివసించేవారు. దురదృష్టవశాత్తు అయ్యరుకి అక్కడ జ్వరం వచ్చింది చాలా వారాలు మంచంలోనే ఉన్నాడు. ఆరోగ్యం కుదుటబడ్డ తర్వాత, తిరువాడుదురై వెళ్ళాలని అభిలషించాడు. గురుపూజ సందర్భంగా పిళ్లైగారు అక్కడికి వస్తారని ఆశించాడు.

తిరువాడుదురై మఠస్థాపకులు శ్రీ నమశ్శివాయమూర్తి. ఆయన గురుపూజ డిసెంబరు–జనవరి నెలల మధ్య (పుష్యమాసం) జరుగుతుంది. అదే ఆ పట్టణంలో జరిగే గొప్ప ఉత్సవం. వివిధ వృత్తులకూ చెందిన ప్రజలు ఆ సందర్భంగా ఆ పట్టణం చేరుకుంటారు. శివార్చన మహావైభవంగా జరుగుతుంది. ఆ ఉత్సవం జరిగే రోజుల్లో పాటకచ్చేరీలు, కావ్యపఠనాలు, సంస్కృత పండితుల విద్వద్గోష్ఠులు,

ఉత్సవం తాలూకు వేడుకలు మొదలైనవి జరుగుతాయి. తిరువాడుదురైకి వచ్చేవారి కందరికీ ఉచితంగా భోజనం పెట్టేవారు.

అయ్యరు పిళ్లైగారిని కలుసుకున్నాడు. ఉత్సవానంతరం మాయూరం వచ్చి అయ్యరు యథాప్రకారం అధ్యయనం కొనసాగిస్తాడా లేదా అని ఆయన తెలుసుకున్నాడు. అనగా, కొంత కాలంపాటు అయ్యరు తనవద్ద అధ్యయనం చేయ్యాలని గురువు ఆశించాడు. గురుపూజ సందర్భంగా పిళ్లైగారి బహుముఖ ప్రజ్ఞను అయ్యరు గ్రహించగలిగాడు ఆశుకవిత చెప్పడంలో ఆయన దిట్ట అని గ్రహించాడు. దేశికరుని ప్రశంసిస్తూ పద్యాలు చెప్పమని పండితులు అడిగేవారు. పిళ్లైగారు వారినందరినీ సంతృప్తి పరిచేవారు. ఆ తర్వాత వారు విశాల భవనంలో ఆసీనులై వున్న దేశికరుని సందర్శించి పిళ్లైగారు చెప్పిన ఆ పద్యాలు చెప్పి బహుమతులు తీసుకు వెళ్ళేవారు. ఆ ప్రశంసా పద్యాలు ఎవరి రచనో దేశికరుకి తెలియకపోదు. ఆ మరునటి రోజు ఉదయం పిళ్లై దేశికరుని దర్శించేవాడు. ఆయన్ని చూసి చూడడంతోనే, "పాపం పిళ్లైగారికి గతరాత్రి తీరికేలేదు" అని దేశికర్ మందహాసం చేసేవాడు.

కొన్నిరోజులు మాయూరంలో గడిపి, పిళ్లై తిరువాడుదురై చేరుకున్నాడు. బండిలో ప్రయాణంచేస్తూ ఆయన అంబర్ పురాణం చెప్పడం ప్రారంభించాడు. గ్రామాలమీదుగా బండి వెడుతుంటే, ఆయన కవితా విహంగానికి రెక్కలు వచ్చేవి. గతుకులబాటమీద అటూ యిటూ ఒరుగుతూ బండి వెడుతుంటే, అయ్యరు గురువుగారు చెప్పే పద్యాలు వ్రాసేవాడు కదుపులవల్ల అయ్యరు వ్రాత ఎగుడు దిగుడుగా ఉండేది కాని, ఉదాత్త కవిత పిళ్లై గళంనుంచి బహిర్గతమయ్యేది. అది భావుకతకు పెట్టింది పేరు।

తిరువాడుదురైలో తరగతుల్ని రెండు భాగాలుగా చేద్దామనుకున్నారు. ఆయితే అయ్యరు విషయంలో ఒక సమస్య తలెత్తింది. ఆయన్ని కొత్త విద్యార్థులతోపాటు కూర్చోబెట్టాలా లేక పాత విద్యార్థుల సరసను కూర్చోబెట్టాలా అక్కడే ఆ సమస్య. చివరికి అయ్యరునే అడిగారు. ఉభయ తరగతులకు తాను హాజరుకాదలిచానని ఆయన బదులు చెప్పాడు. అందువల్ల ఆయనకి ఊపిరాడనంత పని. కాని రెండు విధాల లాభం పొందాడు. అంతేకాక గురువుగారు చెప్పే పద్యాలను రాగయుక్తంగా చదివి, వినిపించవలసిన బాధ్యత కూడా ఆయన మీద పడింది.

# 5

# గురు చరణ సన్నిధి

స్వామినాథ అయ్యరు వ్రాసిన మీనాక్షి సుందరంపిళ్లై జీవితచరిత్ర ఒక ఉత్తమ గ్రంథం. వాళ్ళిద్దరి మధ్య ఆదర్శాత్మకమైన సంబంధం ఏర్పడింది. వాళ్ళ యిరువురి జీవితకాలాల పరిశీలన విద్యావేత్తకు సంతోషప్రదంగా ఉంటుంది. ఆనాటి ముచ్చట్లను అయ్యరు అభివర్ణించిన తీరుని పరిశీలిస్తే, రసవత్తరమైన నాటకం కనిపిస్తుంది. ఒక చిన్న అభిప్రాయభేదంవల్ల వాళ్ళమధ్య వైమనస్యం ఏర్పడింది. అయ్యరు నిస్సహాయుడయ్యాడు. ఒకరాత్రి పిళ్లై మఠంలో భోజనం చేస్తున్నాడు. మఠాధిపతికూడా భోజనానికి కూర్చున్నప్పుడు, కొన్ని నియమాలు పాటించవలసి వుంటుంది. భోజనం మధ్యలో ఎవ్వరూ లేచి వెళ్ళకూడదు. అలా చేస్తే దేశికరుని అగౌరవ పరిచినట్లు అవుతుంది. కాని ఆ రాత్రి అందరికంటె ముందుగా పిళ్లైగారు లేచారు. చీకట్లో వీధి అరుగుమీద పడుకున్న అయ్యరుని చూసి ఆయన, "స్వామినాథయ్యరా? భోజనంచేసావా?" అని ఆదుర్దాగా అడిగాడు అయ్యరు చలించిపోయాడు, అవునని బదులు చెప్పాడు ప్రేమమూర్తి అయిన అలాంటి గురువు మిత్రులు ఆయన్ని అభినందిస్తూ, "గురువుగారికి నీ మీద ఎంత అభిమానమో యిప్పుడు తెలిసింది. లేక పోతే ఆయన భోజనం మధ్య లేచేవారా!" అన్నారు.

తిరువావడుదురైలో అయ్యరు మొదటిసారిగా సుప్రసిద్ధ గాయకులైన మహావైద్యనాథయ్యరుని కలుసుకున్నాడు. దేశికర్ కోరిక మేరకు ఆ గాయకుడు ఎన్నో కీర్తనలు రసవత్తరంగా పాడాడు. ఆ గానం అయ్యరుకి దివ్యగానంగా వినిపించింది. వైద్యనాథయ్యరుగారి జ్యేష్ఠ సోదరుడు శైవ కావ్యమైన పెరియపురాణం ఆధారంగా చేసుకుని ఒక యక్షగానం వ్రాశాడు. ఆ యక్షగానం నుంచి కొన్నిగీతాలు, మీనాక్షి సుందరం పిళ్లై వ్రాసిన గీతాలూ ఆనాడు వైద్యనాథయ్యరు పాడాడు. తన గురువుగారి గీతాలలో అంద చందాలు సంతరించుకున్న ఆ పద మాధుర్యానికి అయ్యరు ముగ్ధుడయ్యాడు.

ఆ రోజుల్లో ఒకసారి పిళ్లై మాయూరంలో ఉన్నాడు. తిరుప్పెరుందురైకి చెందిన సుబ్రహ్మణ్య తంబిరాన్ ఆ క్షేత్రానికి సంబంధించిన స్థల పురాణం వ్రాయించాలని ఆశించాడు అందుకు అన్నివిధాల అర్హుడు మీనాక్షి సుందరం పిళ్లైగారే. అయినా తన పక్షాన ఆయనతో మాట్లాడవలసిందిగా దేశికర్‌ని తంబిరాన్ కోరాడు. వెంటనే ఆయన అయ్యరుని మాయూరం పంపించాడు. అయ్యరు కాలినడకన వెళ్ళి మాయూరం చేరుకున్నాడు. ఆయన్ని చూడగానే పిళ్లై ఆనందభరితుడయ్యాడు. తిరుప్పెరుందురై వేంచేసివున్న వినాయకుణ్ణి వుద్దేశించి ఆయన ఆశువుగా ఇలా చెప్పాడు.

"పెన్నెలవలె భాసించెడు పెన్నెరుల వి
నాయకుని స్మరించుచు జీవనమ్ము గడుపు"

గురుశిష్యులు తిరువాడుదురైకి వచ్చారు. 1872 చివర్లో అయ్యరుకి మశూచికం పోసింది. అప్పుడాయన పెరియపురాణం అధ్యయనం చేస్తున్నాడు. పిళ్లై అయ్యరుని కంటికి రెప్పలా చూసేవాడు. తర్వాత అయ్యరుని తలుపులు మూసిన పల్లకిలో సూర్యమూలైకి పంపించాడు. అక్కడ ఆయన తండ్రీ తాతయ్యా ఎంతో జాగ్రత్తగా చూశారు.

కుంభకోణంలో 1873 లో మహామకం (పుష్కరాలు) వచ్చింది. సుబ్రహ్మణ్య దేశికర్ ఆయన అనుయాయులు కుంభకోణం చేరారు. మహామకం శైవమతానుయాయులకు చాలా పవిత్రమయింది. కాని తాను అందులో పాల్గొనలేకపోయినందుకు అయ్యరు పరితపించాడు. ఆరోగ్యం కుదుటబడిన తర్వాత ఆయన సరాసరి తిరువాడుదురై వెళ్ళాడు.

కుంభకోణంలో తరుచుగా తాను కలుసుకునే త్యాగరాజ చెట్టిగారితో అయ్యరుకి సన్నిహిత సంబంధం ఏర్పడింది యీ రోజుల్లోనే. ఆయనకి అధ్యాపక విషయం ఒకటి చెట్టిగారు తెలియజేశారు. "నగరంలో అప్పుశాస్త్రిగారు ఒక క్రొత్త పాఠశాల స్థాపించదలచారు. ఒక తమిళ పండితుడు కావాలి. నేను మీ పేరు సూచించనా?" అని ఆయన అడిగాడు. ఆర్థికంగా తండ్రి కష్టపడుతున్న రోజులవి. ఎలాగయినా తండ్రికి సహాయపడాలని అయ్యరు అభిలషించాడు. కాని మీనాక్షిసుందరంపిళ్లైకి ఆ సూచన నచ్చలేదు. అయ్యరు ఇంకా చదవాలని ఆయన

ఆశించాడు. అందువల్ల చెట్టిగారితో, "అయ్యరుని నా వద్దనే ఉండనివ్వండి. అవసరమైనప్పుడు ఉద్యోగం చెయ్యవచ్చు" అన్నాడు. ఆ మాటలు వినగానే గురువుగారికి తన శ్రేయస్సుపట్ల గల ఆసక్తిని గ్రహించి అయ్యరు బ్రహ్మానంద భరితుడయ్యాడు.

1873 డిసెంబరులో పిళ్లై తిరుప్పెరుందురై వెళ్ళారు. అయ్యరు, సవేరినాథ పిళ్లైలు ఆయన్ని అనుసరించారు. ఆ క్షేత్ర మాహాత్మ్యం విని వారు ఆశ్చర్యం చెందారు. తమిళ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన శైవగ్రంథం తిరువాచకం సంతరించిన మాణిక్కవాచకరుకి జరిగే ప్రత్యేక అర్చనాదుల్ని చూసి ఎంతో సంతోషించారు.

వాళ్ళు పిళ్లైగారి స్థలపురాణ ఆవిష్కరణోత్సవంలో పాల్గొనేందుకు తిరువాడుదురై వచ్చారు. అప్పటికింకా పురాణం పూర్తి కాలేదు విశ్రాంతి లభించి నప్పుడెల్ల పిళ్లైగారు చాలా పద్యాలు వ్రాసేవారు; వాటిని ఆ మరునాడు నలుగురికీ చదివి వినిపించేవారు, వివరించేవారు కూడా. అది చూచి యువకుడైన అయ్యరు ఆశ్చర్యాంబుధిలో మునిగిపోయ్యేవాడు.

1874 లో ఫిబ్రవరి అంతా అయ్యరు తండ్రి దగ్గర ఉండి ఔషధసేవ చేశాడు. కుటుంబం అప్పులపాలయినట్లూ, తండ్రి సంపాదన బొత్తిగా సరిపోవడం లేదనీ తెలుసుకున్నాడు. అయ్యరు చదువుకి స్వస్తి చెప్పి పౌరాణిక వృత్తి చేపట్టాలని తండ్రి అభిలషించాడు. ఆ పరిసరగ్రామాలవారు ఆయన్ని ఆదరించ గలరనీ చెప్పాడు. అయ్యరు అందుకు అంగీకరించాడు. చెంగనం, కారై గ్రామాలలో ఆయన తిరువిళ్లైయాడల్ పురాణం చెప్పాడు. అందువల్ల ఆయన తమిళభాషాభిమానులు పలువురిని కలుసుకోగలిగాడు. అయినా అయ్యరుకి మనశ్శాంతి లేదు. పిళ్లైగారి అభిమాన శిష్యుడుగా ఉంటే సదవకాశాన్ని కోల్పోవ కూడదనుకున్నాడు. అప్పుడు పిళ్లై అంబరు వెళ్ళారు, అక్కడ తాను వ్రాసిన అంబర్ పురాణ ఆవిష్కరణోత్సవంలో పాల్గొనాలని. అయ్యరు ఆయన్ని అక్కడ కలుసుకుని మళ్ళీ విద్యార్థి జీవితం కొనసాగించాడు.

కారైలో తన తిరువిళ్లైయాడల్ పురాణ ప్రసంగాలు పూర్తి చెయ్యకుండా అంబరుకి రావడంవల్ల, అయ్యరు కారై వెళ్ళి ప్రసంగాలు పూర్తి చేశాడు. ఆయన

ఇంకా కొన్ని రోజులపాటు ఆ గ్రామంలోనే ఉండి పరిసరగ్రామాలలో పురాణ ప్రవచనం చెయ్యాలని గ్రామస్థులు అర్థించారు. కాని ఆయన విద్యార్థి జీవితానికి దూరం కాదలచుకోలేదు తన శ్రేయోభిలాషులకు ఆ విషయాన్ని వినయపూర్వకంగా తెలియజేసి, ఆయన తిరువాడుదురై చేరుకున్నాడు, గురువుగారిని కలుసుకున్నాడు.

మొదటి తమిళనవల ప్రతాప మొదలియార్ చరిత్రం వ్రాసిన వేదనాయకం పిళ్లై దేశికర్ దర్శనార్థం వచ్చాడు. పిళ్లై మాయూరంలో మున్సిఫ్‌గా ఉద్యోగం చేసిన వాడు. ఆ మహనీయులిద్దరూ ప్రదర్శించిన పరస్పర గౌరవభావాల్ని చూసి అయ్యరు ముగ్ధుడయ్యాడు.

అయ్యరుగారి ప్రియతమ గురువు, విద్వత్కవి అయిన మీనాక్షిసుందరం పిళ్లైగారు 1876, జనవరి 1న దివంగతులయ్యారు. తుదిక్షణందాకా ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తమిళసాహిత్యం మీదనే కేంద్రీకృతమై ఉండేవి. కట్ట కడపటి ఆ రోజున కూడా ఆయన శిష్యుడికి తిరువాచకంలో సందేహాలు తీర్చారు. పిళ్లైగారి మరణంతో ఆ పట్టణంలో శోకచ్ఛాయలు గోచరించాయి అయ్యరుకి దుర్భరమైన దుఃఖం కలిగింది. బిగ్గరగా విలపించాడు. దేశికర్ దుఃఖోపశమనం చేశాడు.

"మనం ఒక మణిని కోల్పోయాము. ఆ లోటుని భర్తీ చెయ్యలేము. కాని యేం చెయ్యగలం? నువ్వంటే పిళ్లైగారికి ఎక్కడ లేని అభిమానం. నువ్వు మఠంలో విద్యార్థిగా చేరి, నా వద్ద పాఠాలు చెప్పుకోవచ్చు."

ఆ విధంగా అయ్యరు దేశికర్ శిష్యుడయ్యాడు. కంబరామాయణం, నన్నూల్ శైవసిద్ధాంతగ్రంథాలు మొదలైనవి అక్కడ అధ్యయనం చేశాడు. మఠంలో కొత్తగా చేరే విద్యార్థులకు పాఠాలు చెప్పమని అయ్యరుని దేశికర్ ఆదేశించాడు. ఆ సమయంలో కాపడిచ్చింది సంతరించిన చొక్కికుళం అణ్ణామలై రెడ్డియార్ తిరువాడుదురై వచ్చారు. ఆయన కొన్ని తమిళ గ్రంథాలు క్షుణ్ణంగా అధ్యయనం చేయాలని అభిలషించారు. అయ్యరు ఆయనకు సహాయం చేశాడు.

# 6

# తిరువాడుదుర్రై, కుంభకోణాలలో అధ్యాపకత్వం

అయ్యరు కోసం సుబ్రహ్మణ్యదేశికర్ ఒక యిల్లు కట్టించాడు. ఆయన కంటూ ఒక యిల్లు వుండాలని దేశికర్ అభిలాష. 1877, నవంబరులో అయ్యరు తలిదండ్రులు ఆ యింట్లో కాపురం పెట్టారు. అయ్యరుగారి భార్య కాపరానికి వచ్చింది. ఆ కుటుంబానికి కావలసిన వాటిని మఠం సరఫరా చేసింది. అయ్యరునీ ఆయన సచ్ఛీలాన్ని మెచ్చుకుని దేశికర్ ప్రదర్శించిన ఆదరాభిమానాలకు ఆ యింటిల్లిపాదీ సంభ్రమాశ్చర్యాలు చెందారు.

ఇంతలో మధురలో మీనాక్షి అమ్మవారి ఆలయ కుంభాభిషేకం దగ్గరపడింది. అది దర్శించాలని దేశికర్ ఆశించాడు. దక్షిణ తమిళనాడులోని క్షేత్రాలను దర్శించాలనీ ఆశించాడు. అయ్యరుని రమ్మని పిలిచారు. ఆయన ఎంతగానో సంతోషించాడు. కుంభాభిషేక మహోత్సవంలో అందరూ పాల్గొన్నారు. ఆ సందర్భంలో భవిష్యత్తులో బహు విధాలుగా తోడ్పడిన న్యాయమూర్తి మణి అయ్యరుతో ఆయనకి పరిచయం ఏర్పడింది.

మధుర నుంచి వాళ్ళందరూ తిరునెల్వేలికి ప్రయాణమయ్యారు. అక్కడ పడమటి రథవీధిలో ఉన్న తిరువాడుదుర్రై మఠం భవనంలో బస చేశారు. చాలా మంది కవులూ పండితులూ దేశికరుని దర్శించడానికి వచ్చారు. అనగా అయ్యరుకి తమిళ జ్ఞాన తృష్ణ తీరేందుకు ఒక సదవకాశం లభించింది. తిరునెల్వేలి నుంచి దేశికరు సెవందిపురం వెళ్ళారు. అక్కడ తిరువాడుదుర్రై మఠం సహాయాధిపతి వేణువనలింగ తంబిరాన్ ఒక భవనం నిర్మించి దానికి సుబ్రహ్మణ్య దేశికర్ విలాసం అని పేరు పెట్టాడు. ప్రారంభోత్సవానికి హాజరయిన కవులు ఆ భవనాన్ని ప్రశంసిస్తూ పద్యాలు వ్రాశారు. ఆ పద్యాలను సంకలనం చేసే బాధ్యత అయ్యరుకి ఒప్పగించబడింది. సంగకాలపు కృతుల్ని లెస్సగా పరిష్కరించి తరువాతి కాలంలో

ప్రకటించిన అయ్యరుగారు ఈ అభినందన సంచికతో పరిష్కరణ కార్యానికి శ్రీకారం చుట్టినట్లయింది. ఆ సంచిక మొదటి పుటలో ఈ క్రింది విషయం ప్రకటించబడింది

"గణపతి సహాయం, కైలాస సంప్రదాయానికి చెందిన తిరువాడుదురై ఆధీనంలోని సెవందిపురంలో పై ఆధీనమునకు చెందిన పెద్ద కార్వారు వేణువనలింగ స్వాములవారు నిర్మించిన సుబ్రహ్మణ్య దేశిక విలాస ప్రశస్తి. పై తిరువాడు దురైలో పైన పేర్కొన్న స్వాములవారు నిర్మించిన సభా భవనమనే వేణువనలింగ విలాస ప్రశస్తి, పండితులనేకులు రచించిన యీ పద్యాలను పై ఆధీనానికి చెందిన ఆరుముగ స్వాములవారూ, తిరువాడుదురై వేంకటసుబ్బయ్యరుకి పుత్రుడైన స్వామినాథయ్యరు పరిశీలించి పరిష్కరించగా, తిరునెల్వేలి ముత్తమిళాకర ముద్రణాలయంలో ముద్రితములైనవి బహుధాన్య సంవత్సరం, ఆని నెల."

సెవందిపురం నుంచి అయ్యరు సుబ్రహ్మణ్య దేశికరుని అనుసరించి కుట్రాలం, శంకరన్‌కోయిల్, తిరుచెందూరు మొదలైన క్షేత్రాలు దర్శించి తర్వాత తిరువాడుదురై మఠం చేరుకున్నాడు అయ్యరుగారి తరువాతి రచనలలో ఈ క్షేత్రాల ప్రశంస బహుళంగా కానవస్తుంది.

1880 ఫిబ్రవరి 12 న త్యాగరాజ చెట్టిగారు తిరువాడుదురై వచ్చారు. సుబ్రహ్మణ్య దేశికరుతో ఇలా అన్నాడు : "నేను ఉద్యోగ విరమణ చేస్తున్నాను. నా స్థానంలో నియుక్తుడయ్యే ఆయన సమర్థుడై ఉండాలని కళాశాల అధికారులు అభిలషిస్తున్నారు. స్వామినాథయ్యరుని మనం సిఫారసు చెయ్యవచ్చు. ఆయన కది సహాయకారిగా వుంటుంది."

అయ్యరుని విడిచిపెట్టడానికి దేశికర్ మొదట్లో అంగీకరించలేదు. కాని చెట్టిగారు విడిచిపెట్టలేదు. చివరి కాయన సమ్మతించాడు. కుంభకోణం వెళ్ళడానికి మంచి రోజు నిర్ణయించారు. దేశికర్ వద్ద అనుజ్ఞ తీసుకోడానికి అయ్యరు వచ్చినప్పుడు ఆయన యిలా ఆశీర్వదించాడు :

"మీరు త్యాగరాజ చెట్టిగారి స్థానాన్ని సమర్థవంతంగా భర్తీ చెయ్యాలి. తర్వాత మీరు మదరాసుకి వెడతారు. అక్కడ సుప్రసిద్ధ విద్వాంసులైన తాండవరాయ మొదలియారు, మహాలింగ అయ్యరు, విశాఖ పెరుమాళయ్యరు ప్రభృతులు పని చేసిన చోట పనిచేసి కీర్తి గడించాలి."

భవిష్యత్తులో ఈ మాటలు నిజం కానున్నాయి. ఈ మాటలు స్ఫురణకు వచ్చినప్పుడెల్ల, అయ్యరుగారు ఆర్ద్రచిత్తులయ్యేవారు.

కుంభకోణంలో త్యాగరాజు చెట్టిగారి సహచరులు అయ్యరుని వివిధ విషయాలలో ప్రశ్నలు అడిగారు. వాళ్ళు అడిగిన పద్యాలను ఆయన సంతృప్తికరంగా వివరించాడు. ఆ పద్యాలుగల కావ్యాలను ఆయన క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. మీరు కవిత్వం చెపుతారా? అన్నందుకు ఆయన అవునని సమాధానమిచ్చాడు. వెంటనే త్యాగరాజ చెట్టిగారిని ఉద్దేశించి ఒక పద్యం చెప్పమని ఒకాయన అడిగాడు. కొన్ని నిమిషాలలో అయ్యరు ఈ క్రింది పద్యం ఆశువుగా చెప్పాడు :

"చదివితిమి మనము యశఃకాయుడైన మీ
నాక్షిసుందరుని పదమ్ముల కడ
కుంభకోణము నెలకొన్న యీ కాలేజి✝
యందు నన్ను చేయుమయ్యా వార
సునిగ – త్యాగరాజసూరి! ఓ మహనీయ!"

అప్పుడక్కడ సమావేశమైన అధ్యాపకులు ఆశ్చర్యపోయారు. మీనాక్షి సుందరంపిళ్లైగారి శిష్యుడికి అంత పాండిత్యం ఉండడంలో ఆశ్చర్యమేమీ లేదని పేర్కొన్నారు. కళాశాలాధ్యక్షులైన గోపాలరావు తృప్తి చెందారు. అయ్యరుగారు వెనువెంటనే కళాశాలలో చేరవచ్చునని ఆయన అన్నాడు తదాదిగా ఆయన జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభమయింది. అనగా కళాశాలలో విద్యార్థులకు బోధించే ఉపన్యాసకుడయ్యాడన్న మాట!

మొదట్లో ఆయన తరగతుల్ని గోపాలరావు పర్యవేక్షించేవాడు అయ్యరుగారు విద్యార్థులకు అర్థమయ్యేలా వివరించడమూ, ఆసక్తికరంగా బోధించడమూ చూసి ఆయన తృప్తి చెందాడు.

అయ్యరుగారు తరుచుగా తిరువాడుదురైకి వెళ్ళి తన అనుభవాలను దేశికరుకి తెలియజేసేవాడు. ఆయన మంచి అనుభవం గడిస్తున్నాడనీ, అధ్యాపకుడిగా పేరు సంపాదిస్తున్నాడనీ, గ్రహించి ఆయన సంతుష్టుడయ్యాడు.

---

✝ తమిళ మూలంలో అయ్యరుగారు కాలేజి అని వాడారు.

కుంభకోణం కళాశాలలో చేరిన కొన్ని నెలలకే ఆయనకి ఒక కొడుకు పుట్టాడు. అతనికి కళ్యాణసుందరం అని పేరు పెట్టారు. తిరునల్లూరులో వేంచేసి యున్న కళ్యాణ సుందరేశ్వరస్వామివారి అనుగ్రహం వల్ల జన్మించాడు కనక, అతనికి ఆ స్వామి పేరు పెట్టారు.

# 7

# ప్రముఖ గ్రంథ పరిష్కర్త

అయ్యరుగారు కళాశాలలో చేరిన రోజుల్లో సేలం రామస్వామి మొదలియారు జిల్లా మునసబుగా పని చేసేవాడు. మొదలియారు తమిళం, సంస్కృతం, సంగీతం మొదలైన వాటిలో దిట్ట. ఆయన మైత్రిని పొందడం వాంఛనీయమని అయ్యరుగారికి దేశికర్ సలహా యిచ్చాడు 1880, అక్టోబరు 21న అయ్యరు మొదలియారుని ప్రప్రథమంగా కలుసుకున్నాడు మీనాక్షి సుందరం పిళ్లై, సుబ్రహ్మణ్య దేశికర్‌ల వద్ద తాను అభ్యసించినట్లు తెలియజేశాడు. అధ్యయనం చేసిన కావ్యాల వివరాలు చెప్పమని మొదలియారు అడిగాడు. పెక్కు అన్తాది, పిళ్లైత్తమిళ్, కోవై కృతులు తాను చదివానని ఆయన సమాధానం చెప్పాడు. వాటివల్ల ఏమి లాభమని మొదలియార్ ప్రశ్నించాడు అది విని అయ్యరు ఆశ్చర్యపడ్డాడు. తాను కంబరామాయణం మొదలైన కావ్యాలు కూడా చదివానని ఆయన అన్నాడు.

"ఇవన్నీ తరువాతి కాలానికి చెందిన పుస్తకాలు మీరు ప్రాచీన తమిళ కావ్యాలు చదివారా? జీవక చింతామణి, మణిమేకలై కావ్యాలు చదివారా?" ప్రశ్నించాడు మొదలియారు

అయ్యరుగారు నిరుత్తరులయ్యారు. వాటి తాళపత్ర ప్రతుల్ని కనక తన కిచ్చినట్లయితే, వాటిని చదివి ప్రాశస్త్యాన్ని గుర్తించగలనని ఆయన ధైర్యం చేసి అన్నాడు.

ఆ తర్వాత కొన్నాళ్ళకు ఆయన రామస్వామి మొదలియారు వద్దకు వెళ్ళాడు. మొదలియారు జీవక చింతామణి కాగితపు ప్రతిని ఆయనకి యిచ్చాడు. అది చదవ

గానే, ఆయన సంఠిగ్ధావస్థలో పడ్డాడు. ఆ కావ్యానికి నచ్చినార్‌కినియార్ వ్రాసిన వ్యాఖ్య కూడా ఉంది. ఆయన ఆ కావ్యాన్ని చాలా సార్లు చదివి, అందులోని విషయాలు గ్రహించాడు. మొదలియారు కోరిక మేరకు, ఆయన పద్యాలు చదివి వివరించాడు. అర్థం కాని చోట్ల అర్థం కావడం లేదని ఆయన చెప్పాడు. అయ్యరు గారి నిజాయితీని చూసి మొదలియారుగారు మెచ్చుకున్నారు. జీవక చింతామణి జైన కావ్యం కావడం వల్ల, కుంభకోణంలోని జైనుల వద్దకు వెళ్ళి అయ్యరుగారు తన ధర్మ సందేహాలు తీర్చుకున్నారు. జైనమతం, ఆ సంప్రదాయాలు, సిద్ధాంతాలు మొదలైనవి తెలిసిన తర్వాత, ఆ కావ్యం హృద్గతమయింది. ఆ కావ్యానికి మంచి పరిష్కరణ ఒకటి వెలుగు చూడాలన్నదే ఆయన అభిలాష. ఆయన పెక్కు వ్రాత ప్రతుల్ని సంప్రదించాడు; పాఠ నిర్ణయం కావించాడు.

ఆ కావ్య ముద్రణకు మదరాసు అనువైన స్థలమని గ్రహించి, ఆయన అక్కడ రెండు వారాల పాటు బస చేశాడు. అక్కడ అప్పుడు సుప్రసిద్ధులైన రచయితలు పలువురు ఉండేవారు. వారిని తరుచుగా కలుసుకున్నాడు. తేరళుందూరుకి చెందిన చక్రవర్తి రాజగోపాలాచారిగారు ముద్రణభారాన్ని వహించడానికీ, ప్రూఫులు చూడడానికీ సహర్షంగా సమ్మతించాడు. ఒక ప్రాచీన కావ్యాన్ని ఓం ప్రథమంగా ప్రచురించే భాగ్యం తనకు కలిగినందుకు ఆయన ఉప్పొంగిపోయాడు. ఎంతో ఉత్సాహంతో కృషి చేశాడు. 500 ప్రతులు అచ్చువేశాడు.

జీవక చింతామణిని ముద్రించడంతో, తమిళ సాహిత్యంలో పునరుజ్జీవనం ఏర్పడినట్లయింది. ప్రాచీన వ్యాఖ్యాత ఉదాహరించిన పద్యాలు గల కావ్యాలను పరిష్కర్త తెలియజేశాడు. తులనాత్మక పరిశీలనకుగాను ఆయన కొన్ని భాగాలు చేర్చాడు. ఆ విధంగా ఆ పరిష్కరణ ప్రాచీన తమిళ కావ్యాల పెన్నిధిగా రూపొం దింది. సహృదయుల మన్ననలకు పాత్రమయింది ఆ పరిష్కరణ.

వాంఛా పరిపూర్తి అవుతున్న ఆ రోజులలో తలవని తలంపుగా విషాదవార్త వినవలసి వచ్చింది. తిరువావుదుదురై మఠాధిపతులైన సుబ్రహ్మణ్య దేశికర్ 1888, జనవరి 7న దివంగతులయ్యారు. అయ్యరుగారు దుఃఖార్ణవంలో మునిగిపోయారు. ఆయన తన భావాలను తన స్వీయ చరిత్రలో ఇలా పేర్కొన్నారు.

"నిలిచిన చోటనే నిలబడిపోయాను ఏమీ తోచలేదు. పుస్తకం తాకడానికి మనస్కరించలేదు నాలో రక్తప్రసారం ఆగిపోయినట్లనిపించింది. ఆయన నా ప్రతి

ప్రయత్నాన్ని ప్రశంసించారు. నాకు లభించే గౌరవాలను చూసి తల్లి తనయుడి పేరు పెంపులు విని ఉప్పొంగి పోయినట్లుగా ఆయన సంతసించేవారు. నన్ను కాపాడిన ఆ పరోపకారిని స్మరించుకుని దుఃఖిస్తున్నాను.

నా దుఃఖాన్ని తగ్గించుకునేందుకు నాకు మార్గాంతరం తోచలేదు. నా దుఃఖమే పద్యాకృతి దాల్చింది, ఆయన మూర్తిని ఇక చూడలేననే భావం నాకు కలిగేసరికి నా మనస్సులో నిలిచిపోయిన ఆ ఆకృతి కండ్ల యెదుట తోచింది."

ఆ రాత్రికి రాత్రే ఆయన మదరాసు నుంచి తిరువాడుదురైకి ప్రయాణ మయ్యాడు శ్రీ అంబలవాన దేశికర్ కొత్త మఠాధిపతి అయ్యారు. గురుపూజా కార్యక్రమం శ్రద్ధగా నిర్వర్తించబడింది. ఆ కార్యక్రమంలో అయ్యరుగారు పాల్గొని ధైర్యోత్సాహాలు పొందారు.

సుబ్రహ్మణ్యదేశికర్ మరణం వల్ల కలిగిన దుఃఖభారం తీరక ముందే, అయ్యరుగారికి బహు విధాల తోడ్పడిన త్యాగరాజు చెట్టియార్ మరణించారు. 1888 బాధామయంగా గడిచింది.

జీవక చింతామణి ప్రచురణ పూర్తి కాగానే, ఆయన పత్తుప్పాట్టుని పరిశోధించసాగాడు. జీవక చింతామణి యేమో కావ్యం. పత్తుప్పాట్టు కదసంగంలో వెలిసిన సంకలనం. వ్రాత ప్రతుల కోసం ఆయన తమిళనాడులోని మారుమూల గ్రామాలకు చాలా సార్లు రాకపోకలు సాగించాడు పాఠ నిర్ణయం చెయ్యడానికే ఆయన అలా పర్యటించాడు.

ఆ రోజుల్లో, అయ్యరుగారంటే ఈర్ష్య వహించిన కొందరు జీవక చింతామణిని విమర్శిస్తూ ఉత్తరాలు వ్రాశారు. శైవమఠంలో పెరిగి పెద్దవాడైన ఒక వ్యక్తి జైన కావ్య ముద్రణకు నడుము బిగించవచ్చునా? అని వారి విమర్శ. ఆ విమర్శలకు ఆయన దీర్ఘ ప్రత్యుత్తరమిచ్చాడు. అలాగే తన పరిష్కరణలో దోషాలని చూపబడ్డ వాటికి కూడా సమాధానమిచ్చాడు. ఆ సమాధానాన్ని తన సహ వ్రతుడు సాధుశేషయ్యరుకి చూపించాడు. ఆ ప్రత్యుత్తరాన్ని తన సహచరుడు తప్పక ప్రచురిస్తాడని ఆయన విశ్వసించాడు. కాని శేషయ్యరు దాన్ని చింపి వేస్తూ యిలా సలహా యిచ్చాడు. "అలాంటి విమర్శలకు సమాధానం వ్రాయవద్దు. ఆ విధంగా విమర్శకులకు ప్రచారం లభిస్తుంది. ఒక్కొక్కసారి మీ కార్యక్రమానికి అంతరాయం వాటిల్లవచ్చు."

పత్తుప్పాట్టు పఠనంలో అయ్యరుగారు దీర్ఘ రాత్రులు గడిపారు. మిత్రుల ఆర్థిక సహాయంతో ఆయన ఆ సంకలనాన్ని మదరాసులో ప్రచురించాలని నిశ్చయించాడు. పత్తుప్పాట్టు సమగ్రంగా లభించకపోయినప్పటికీ, నచ్చినార్ కినియర్ వ్యాఖ్యాను ఆధారంగా చేసుకుని మూలంలోని పద్యాలను నిర్ణయించాడు. ముద్రణ ఆరు నెలలపాటు సాగింది. 1889, జూనులో పూర్తి అయింది.

ఇక ఆయన సుప్రసిద్ధమైన సిలప్పదికార కావ్య పరిష్కరణకు పూనుకున్నాడు. వ్రాతప్రతుల గాలింపు మొదలుపెట్టాడు. అడియార్కు నల్లార్ వ్యాఖ్యానం ఆధారంగా చేసుకుని ఆయన తత్కావ్య పరిశోధనకు పూనుకున్నాడు. కాని లభించిన ఆ వ్యాఖ్యానం అన్ని ఆశ్వాసాలను (గాథలను) స్పృశించలేదు. కాని అపూర్వపద పట్టిక వంటిది ఒకటి లభించింది. దాని సహాయంతో ఆయన కొన్ని పద్యాల విశేషార్థాలు గ్రహించగలిగాడు. 1891లో వేసవి సెలవలలో ఆయన తాళపత్ర ప్రతులకోసం తిరునెల్వేలి జిల్లాలో పర్యటన సాగించాడు. తత్ఫలితంగా క్రిమిద్రష్టములైన రెండు ప్రతులు లభించాయి. పాఠనిర్ణయం కావించి, ముద్రణకు దిగాడు. కుంభకోణం కళాశాలలో ఉపన్యాసకపదవిని సమర్థంగా నిర్వహిస్తూనే ఆయన యీ పరిశోధన వ్యాసాంగం పూర్తిచేశాడు. విశ్రాంతి సమయంలోని ప్రతి నిమిషమూ కావ్య పరిష్కరణకు వినియోగించబడింది. నిజంగానే యిది బృహత్కార్యం. కనుక ప్రతి పరిష్కరణకు పిమ్మట ఆయన పొందే సంతృప్తి అనిర్వచనీయ మనవచ్చు.

సిలప్పదికారం ప్రచురించబడిన తర్వాత, మణిమేకలై, పురనానూరు కృతుల వైపు ఆయన దృష్టి మళ్ళింది. పురనానూరులోని తొలి 260 పద్యాలకు ఒక ప్రాచీన వ్యాఖ్య ఉంది. కాని ఆ తరువాతి పద్యాలు అయోమయంగా కనిపించాయి. అయితే అప్పటికే సంగం సంస్కృతి, పదజాలం మొదలైనవి ఆయనకి కరతలామలకము లయినాయి. 1893, జనవరిలో మదరాసులో పురనానూరు ముద్రణ మొదలయింది. ఆ యేడు సెప్టెంబరులో అయ్యరుగారికి పితృవియోగం కలిగింది. ఆ దుఃఖ భారం నుంచి తేరుకునేంతలోపల, మరొక ప్రాణ స్నేహితుడు పూండి అరంగనాథ మొదలియారు డిసెంబరులో కాలధర్మం చెందాడు. ఇవన్నీ ఆయన్ని కలచివేశాయి; మనశ్శాంతి తక్కువయింది. అయినా 1894, సెప్టెంబరులో పురనానూరు వెలువడింది. పెక్కు చారిత్రక విషయాలతోపాటు విమర్శాత్మకాంశాలు కూడా ఆయన తెలియజేశాడు. ఈ పురనానూరు పరిష్కరణ వెలుగు చూసిన తర్వాత చాలామంది

పండితులు సంగయుగానికి సంబంధించిన పెక్కు విమర్శగ్రంథాలు, పరిశోధనాత్మక రచనలు ప్రకటించారు.

తాళపత్ర ప్రతులనుంచి సుపరిష్కృత గ్రంథాలు తయారు చేయ్యడం అనుకున్నంత సులభంకాదు. వివిధ పరిస్థితులలో వ్రాతప్రతులు వెలుగు చూశాయి. ఒక ఉదాహరణ. ఒక కవి తన విద్యార్థులకు తాను వ్రాసిన ఒక కావ్యాన్ని చదువుతూ వివరిస్తున్నాడనుకుందాము. ఆయన చెపుతున్నది విద్యార్థులు వ్రాసుకుంటారు. అలా వ్రాసుకునేటప్పుడు, వాళ్ళు అసంగతమైన విషయాలుకూడా వ్రాసి వుండవచ్చు. అవి కవి చెప్పినవే కావచ్చు. ఆ ప్రతుల్ని చూసి వ్రాసేవారు మూలాన్ని, వ్యాఖ్యాన విషయాలను యథాతథంగా వ్రాస్తారు. కాగా, వ్రాత ప్రతులలో లెక్కలేనన్ని దోషాలు దొరలుతాయి. అదీ కాక తాళపత్ర ప్రతులలో ఉదాహరణములుగా ఉదాహృతములైన పద్యాలను ఏ కావ్య పద్యాలో అని గుర్తించడమూ కష్టమే.

ఇక వ్యాఖ్యానాలు లేని ప్రాచీన కృతులు గురించి. అవి శిథిలములై ఉండవచ్చు అక్షరాలో మాటలో కొన్ని అక్కడక్కడ లోపించి వుండవచ్చు. కొన్ని పద్యాల క్రమం (తిణై)గుర్తింపబడకపోవచ్చు కొన్ని పద్యాల విషయంలో ఇతివృత్తం (తుఱై) లోపించి వుండవచ్చు. కొన్ని పద్యాల విషయంలో రెండూ లోపించి వుంటాయి. కొన్నిటికి కర్త ఎవరో సూచింపబడకపోవచ్చు. కొన్నిటి పేర్లలో గజిబిజి యేర్పడి వుండవచ్చు. కొన్ని పద్యాలు ఒకే సంఖ్య కింద వ్రాయబడి వుండవచ్చు లేక ఒకే పద్యం భిన్న సంఖ్యలు కలిగివుండవచ్చు. కొన్నిటికి ఎత్తుగీతులుండక పోవచ్చు. కొన్నిటి విషయంలో మధ్యభాగాలు, మరికొన్నిటి అంత్య భాగాలూ లుప్తమై వుండవచ్చు. తాళపత్ర ప్రతుల్ని అలాగే ముద్రణాలయానికి పంపవచ్చునని భావించడం చాలా పొరపాటు. అవి సక్రమంగా ఉండవు. కొంతమంది పరిష్కర్తలు నిరుత్సాహంకొద్దీ మధ్యలోనే తమ పనిని ఆపివేశారు. ఇంతవరకు పురనానూరును పరిష్కరించి ప్రకటించినవారులేరు. కొందరయితే ఆ పద్యాలను సరిగా అర్థం చేసుకోలేకపోయారు. కాని భగవదనుగ్రహంవల్లనూ, అయ్యరుగారి అపార పాండిత్యంవల్లనూ నిరుపమానమైన సహన భావంవల్లనూ ప్రాచీన తమిళ సంస్కృతికి చెందిన యీ అమూల్య సంపద తమిళనాడుకి సంక్రమించ గలిగింది. కాని పని పూర్తి అయిన పిమ్మట అయ్యరుగారు తాను పడిన యెన్నో అవస్థలను విస్మరించేవారు. పదినెలలు మోసి, దుర్భరమైన

ప్రసవవేదన పడి, కని, ఆ నవజాత శిశువుని చూసి ఆ తల్లి ఆనంద పారవశ్యం చెందినట్లుగా, పురనానూరు ముద్రిత ప్రతిని చూసి అయ్యరుగారు పరమానంద భరితులయ్యారు.

ఆ తర్వాత ఆయన బౌద్ధకావ్యమైన మణిమేకలైని స్వీకరించారు. జీవక చింతామణిని పరిష్కరించే సమయాన కలిగిన సందేహాలను నివృత్తి చేసేందుకు జైన పండితులు తమిళనాడులో లభించారు. కాని బౌద్ధమత ధర్మాలు అవలంబించిన బౌద్ధులులేరు. మణిమేకలై కావ్యం బౌద్ధమత ధర్మాలకు పెన్నిధి వంటిది. కానీ ఆ కావ్యం మొదటిసారిగా పఠించినప్పుడు, అయ్యరుగారికి కావ్య గత భాగాలు కొన్ని విడ్డూరంగా కనిపించాయి. ఒక బౌద్ధ రచయిత వ్రాసిన వీరచోళియం అనే లాక్షణిక గ్రంథంద్వారా బౌద్ధమత విషయాలు కొన్నిటిని ఆయన గ్రహించారు. మదరాసులోని ఆచార్య మఝూర్ రంగాచారియార్ బౌద్ధమతాన్ని బాగా అధ్యయనం చేసినవాడు. ఆయనద్వారా అయ్యరుగారు ఎన్నో ధర్మ సందేహాలను నివృత్తి చేసుకున్నారు. ఆయన బౌద్ధ ధర్మములను గురించి వ్రాయబడిన గ్రంథాలను రంగాచారియారుకి ఇచ్చాడు అవి ఆయన చదివి తమిళంలో వివరించాడు. అయ్యరుగారు ఆ వివరణ వింటూ నోట్సు వ్రాసుకున్నారు. ఆలోగా ఆయన పురప్పొరుళ్ వెణ్బామాలైని ప్రచురించాడు.

1896, జూనులో మణిమేకలైని అచ్చుకిచ్చారు. బుద్ధుడు, బౌద్ధ ధర్మం, బుద్ధుని సంఘం అనే శీర్షికల కింద తాను బౌద్ధమతం గురించి తెలుసుకున్న వివిధాంశాలను తెలుపుతూ ఆయన ఒక ప్రశస్త పీఠిక వ్రాశారు. అపూర్వ పద పట్టిక, అకారాద్యక్షర క్రమంలో సూచిక మొదలైనవికూడా చేర్చారు. 1898 లో మణిమేకలై ముద్రణ పూర్తి అయింది. 69 తమిళ కావ్యాలనుంచీ, 29 సంస్కృత గ్రంథాలనుంచీ ఆయన కొన్ని భాగాలు గ్రహించి తమ పరిష్కరణలో చేర్చారు. కఠిన శబ్దాలకు సవివరంగా అర్థం తెలియజేశారు. కావ్య కథను వచనంలో వ్రాసి అదికూడా అనువందించారు. పాఠకుడికి ఆ వచన కథ తోడ్పడుతుందనడంలో సందేహంలేదు.

తర్వాత అయ్యరుగారు ఐంగురునూరు, పదిట్రుప్పత్తు, అగనానూరు, పెరుంగదై (బృహత్కథ) మొదలైన వాటిని పరిశోధించసాగారు. ఐంగురునూరు ఎట్టుత్తొగైకి చెందిన కృతి తమిళ కావ్యాలలో కానవచ్చే ప్రధాన భౌగోళిక భాగ

పంచకం గురించి 500 గీతాలు ఈ సంకలన కృతిలో చోటు చేసుకున్నాయి. ఒక్కొక్క భాగం గురించి 100 గీతాలు సంతరించబడ్డాయి. చేరరాజుల ప్రశస్తిని తెలిపే కృతి పదిట్రుప్పత్తు. ప్రణయం గురించి తెలియజేసే కృతి అగనానూరు. పెరుంగదైలో ఉదయనుని కథ వివరించబడింది. వీటిని ఒక్కొక్కటిగా ప్రచురించాలని అయ్యరుగారు కృత నిశ్చయులయ్యారు. అందువల్ల ఆయన ప్రాచీన తమిళ చరిత్ర, సంస్కృతి మొదలైన వాటిని గురించి పరిశోధన చెయ్యసాగారు.

# 8
# గుర్తింపు

రామనాథపురం రాజ కుటుంబానికి చెందిన పా. పాండిత్తురై తేవర్ అనే సహృదయుడు మణిమేకలై, పురప్పొరుళ్ వెణ్బామాలై కృతుల్ని ప్రచురించేందుకు అయ్యరుగారికి సహాయపడ్డాడు. మధురలో తమిళ సంగ(ఘ)స్థాపకుడు తేవర్. ఆయన పెక్కు కావ్యాలు ప్రచురించాడు. సెందమిళ్ అనే తమిళ పత్రికా ప్రచురణకు కూడా ఆయనే కారణభూతుడు. 1898లో తేవర్ తల్లి కాలధర్మం చెందింది తన సంతాపాన్ని తెలియజేసేందుకు అయ్యరుగారు రామనాధపురం వెళ్ళారు. పాండిత్తురై తేవర్‌గారి భవనాన్ని "సోమసుందర విలాసం" అని వ్యవహరించే వారు. అక్కడ ఆయన ఒక నెల రోజులు బసచేశాడు. ఆ తమిళ విద్వాంసు లిద్దరూ ఉదయాలలోనూ సాయం సమయాలలోనూ కలిసి దీర్ఘ చర్చలు సాగించేవారు. ఒకనాడు తేవర్ అయ్యరుగారితో ఇలా అన్నాడు.

"మా అమ్మగారి మరణానికి సంతాపం తెలియజేసేందుకు మీరిక్కడికి వచ్చారు. మీ సాంగత్యం ఫలితంగా నా దుఃఖం మాయమయింది మా అమ్మగారు చాలా గొప్పది. ఎన్నో సత్కార్యాలకు ఆవిడే కారణం. మరణించిన తర్వాతకూడా, ఆవిడ మిమ్మల్ని యిక్కడికి రప్పించింది తత్ఫలితంగా తమిళ కావ్యరసాస్వాదనం చేసే భాగ్యం నాకు కలిగింది."

ఒక రోజు పాండిత్తురై తేవర్ భాస్కరసేతుపతి రాజుని దర్శించేందుకు వెళ్ళాడు. తేవర్ తిరిగి వస్తుంటే, రాజు ఒక ముఖ్యమైన విషయం చెప్పాడు. అందుకు తేవర్ సహర్షంగా సమ్మతించాడు. తర్వాత ఆయన సరాసరి అయ్యరుగారి దగ్గరికి వెళ్ళాడు. "నేను మీకో శుభవార్త తెచ్చాను" అన్నాడు తేవర్. "ఏదైనా ఒక కొత్త పుస్తకం పరిష్కరించమంటున్నారా?" అడిగాడు అయ్యరు.

"ఒకటి కాదు. కావలిసినన్ని పుస్తకాలు మీరు పరిష్కరించి ప్రచురించ వచ్చు. రాజుగారు మీకో గ్రామం దానం చెయ్యాలని అభిలషిస్తున్నారు. అందువల్ల మీకు బోలెడు డబ్బు వస్తుంది. ఇవాళ నేను అంతఃపురానికి వెళ్ళాను. భాస్కర సేతుపతిగారు ఈ శుభ సమాచారం చెప్పారు." అని తేవర్ వివరించారు. "ఇన్నాళ్ళూ మీకు చెప్పుకోదగిన సహాయం చెయ్యలేదని రాజుగారు బాధ పడుతున్నారు. అందు వల్ల తమ జమీనులోని ఒక గ్రామాన్ని మీకు దానం చేయదలిచారు. ఈ విషయాన్ని రాజావారే మీకు తెలియజేయమన్నారు" అని కూడా చెప్పాడు.

తలవని తలంపుగా అలా ధనలబ్ధి కలుగుతున్నందుకు అయ్యరుగారి ముఖంలో ఆనంద చిహ్నమేమీ కనిపించలేదు. ఆయన అన్నాడు గదా: "రాజా వారికి నా మీద ఎంత అభిమానమున్నదో ఈ విషయంవల్ల అవగతమవుతున్నది. నేను ఆయనతో ఈ విషయం మాట్లాడతాను."

అయ్యరుగారు సేతుపతిని దర్శించడానికి వెళ్ళాడు కృతజ్ఞతను తెలపడానికి ఆయన వచ్చివుండవచ్చునని సేతుపతి భావించాడు. ఆయన ఈ విషయం మొదట ప్రస్తావించలేదు. కొంతసేపయిన తర్వాత వినయపూర్వకంగా ఇలా అన్నాడు.

"మహారాజావారు చెప్పమన్న విషయాన్ని పాండిత్తురై తేవర్ చెప్పారు. తమకు నా పట్ల ఎంత ఆదరభావం కలదో నేను గుర్తించ గలిగాను. ప్రస్తుతం నాకేమీవద్దు. భగవదను గ్రహంవల్ల కాలేజివారు నాకు జీతం యిస్తున్నారు. గుట్టుగా సంసారం చేయడం నేర్చుకున్నాను తమరుచేసే గ్రామదానాన్ని నేను తిరస్కరి స్తున్నట్టు తాము భావించకూడదు. సంస్థానం స్థితిగతులు నాకు తెలుసు. ఈ పరిస్థితు లలో మీరు ప్రదర్శిస్తున్న ఈ ఔదార్యాన్ని భరించలేను."

అప్పట్లో సంస్థానం ఆర్థిక పరిస్థితులు అంత తృప్తికరంగాలేవు. అయ్యరు గారి భావాన్ని సేతుపతి గ్రహించకపోలేదు. "సరే మీ యిష్టం" అని, ఆయనకి

వీడ్కోలు చెప్పాడు. ఆ తర్వాత ఎప్పుడూ కూడా గ్రామదానాన్ని తాను తిరస్కరించి నందుకు ఆయన బాధ పడలేదు.

ఆ రోజుల్లో కుంభకోణం కాలేజీ అధ్యక్షులు వి. నాగోజీ రావు. ఆయన సంగీతంలో దిట్ట. సంగీత గ్రంథాలు కొన్ని ముద్రించాలని ఆయన అభిలషించాడు. అందుకు ఆయన అయ్యరుగారి సహాయాన్ని అర్థించాడు. ఆయన కోరిక మేరకు ఆ సంగీత గ్రంథాలను అయ్యరుగారు చక్కగా పరిష్కరించారు. నాగోజి రావు ఆయనకి మరో విధంగా సహాయం చెయ్యాలనే తలంపుతో ఇలా అన్నాడు.

"మీరు ప్రాచీన తమిళ కావ్యాలు ప్రచురిస్తున్నారు అందువల్ల మీకు ధనలబ్ధి కలగడంలేదని నాకు తెలుసు. మీ ఆదాయంలో కనుక మార్పు వస్తే, మీరు మరింత వుత్సాహంతో ముద్రణ కార్యం చేపట్టగలరు. ప్రస్తుతం పాఠశాలలల్లో చెప్పబడు తున్న పుస్తకాలు అంత సవ్యంగా ముద్రించబడడంలేదు. మీరు కనుక పాఠ్య పుస్తకాలు వ్రాస్తే, చాలా బాగుంటుంది. మూడవ తరగతినుంచి మూడవ ఫారం దాకా మీరు పుస్తకాలు వ్రాస్తే, వాటిని ప్రచురించేందుకు ఓరియన్ట్ లాంగ్‌మన్స్ పబ్లిషింగ్ కంపెనీవారు సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు ప్రతి ఫలం బాగా యిస్తారు. ఆ రాయల్టీ డబ్బుతో మీరు మీ తమిళ సాహిత్య సేవ చెయ్యవచ్చు"

అయ్యరుగారు కొంచెంసేపు ఆలోచించి, వినయ పురస్సరంగా ఇలా అన్నారు.

"మీరు నా యందు చూపుతున్న ఆదరభావానికి చాలా కృతజ్ఞుణ్ణి. మీరు నా సమస్యల్ని అర్థం చేసుకున్నందుకు సంతోషిస్తున్నాను. పాఠ్య పుస్తకాలు వ్రాయమని ఇతర మిత్రులు కూడా నాకు సలహా యిచ్చారు. కాని నాకు డబ్బు ముఖ్యంకాదు. తమిళం బోధించడానికీ, తమిళ కావ్య పరిశోధన చెయ్యడానికీ నేను కాలాన్ని పూర్తిగా వినియోగిస్తున్నాను. డబ్బు తనక రావడం మొదలు పెడితే, కోరికలు పెరగవచ్చు. పనిలోనూ ఆసక్తి తగ్గవచ్చు.అప్పుడు ప్రాచీన తమిళ కావ్య పరిశోధనకీ ప్రచురణకూ వ్యవధి వుండకపోవచ్చు. తమ సలహాను నిరాకరిస్తున్నానని మీరు భావించవద్దు. నన్ను నా దోవను పోనివ్వండి."

మంచి రాబడిని వదులుకుంటున్నాడే అని నాగోజిరావు ఆశ్చర్యపోయాడు. కాని తన సహచరుని తమిళ సాహిత్యాభిమానం తలుచుకుని ముగ్ధుడయ్యాడు.

1898లోని ముఖ్య సంఘటనలలో ఒకటి హావ్‌లక్ ప్రభువు కుంభకోణం కళాశాలను విజయం చేయడం. ఆ రోజుల్లో ఆంగ్ల భాషదే పై చెయ్యి కనుక మదరాసు గవర్నరుగారికి ఆంగ్లంలోనే స్వాగత పత్రం సమర్పించడం సముచిత మని అందరూ భావించారు కాని అయ్యరుగారి విషయం నాగోజిరావుగారికి బాగా తెలుసు. తమిళంలో స్వాగతపత్రం చదవమని ఆయన్ని కోరాడు గవర్నరు కళాశాలకు విజయం చేసినప్పుడు, ప్రముఖులు పలువురు ఆనాటి సభకు హాజరయ్యారు. అయ్యరుగారు తాను తమిళంలో వ్రాసిన స్వాగత పద్యాలు చదివారు. అలా చదవడం ఆ సందర్భానికి అర్థవంతమైనదిగా ఉన్నదని సభాసదులు భావించారు. గవర్నరుగారితో పాటు అయ్యరుగారిని ఫోటో తీశారు

ప్రాచీన తమిళ కావ్య పరిష్కరణవల్ల అయ్యరుగారికి కొన్ని యిబ్బందులు కూడా ఎదురైనాయి. ఆయన్నీ ఆయన జీవిత ధ్యేయాన్నీ ఎరిగిన కొందరు తమవద్ద కొన్ని వ్రాతప్రతులున్నాయని ఆయనికి ఉత్తరాలు వ్రాసేవారు. డబ్బు కనక పంపిస్తే, వ్రాతప్రతులు పంపిస్తామనీ వ్రాసేవారు. తలవని తలంపుగా అలా కావ్య నిధులు సమకూరుతాయనే ఉద్దేశంతో, ఆయన వాళ్ళకి డబ్బు పంపేవాడు. కొన్ని సందర్భాలలో ఆ డబ్బుకి తగిన ఫలం లభించేదికాదు.

ఒకసారి ఒక పండితుడు తనవద్ద శాప పురాణపు ప్రతి ఉన్నదని అయ్యరు గారికి ఉత్తరం వ్రాశాడు. ఆయన డబ్బు పంపాడు వ్రాతప్రతి వచ్చింది. అది శరభ పురాణం శివుడు శరభమూర్తి రూపం దాల్చిన కథను వివరించే గ్రంథమది. అది శాప పురాణం కాకపోయినా, డబ్బు పంపినందుకు ఏదో ఒక పురాణ గ్రంథం లభించినందుకు ఆయన సంతోషించాడు.

1901లో మధురలో తమిళ సంఘం నెలకొల్పబడింది. తదాదిగా వార్షి కోత్సవాలు సక్రమంగా జరగసాగాయి. ప్రతి సంవత్సరమూ పాండిత్తురై తేవర్ కోరిక మేరకు ప్రతి యేడూ వార్షికోత్సవ కార్య క్రమంలో ఆయన పాల్గొనేవాడు. రెండవ రోజు జరిగే కవిసమ్మేళనానికి ఆయన అధ్యక్షత వహించేవాడు ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి

1900లో కొందరు భాషాభిమానులు మదరాసులో ద్రావిడ భాషా సంఘం స్థాపించారు. విద్యాశాఖకు చెందిన శేషాద్రి ఆచార్, ఫాదర్ జె. లార్స్‌లు కార్య దర్శులు. అయ్యరుగారు ఆ సంఘంలో గౌరవ సభ్యులు.

అధ్యాపకుడుగా పండితుడుగా అయ్యరుగారి పేరు పెంపులు బాగా వ్యాపించాయి. ఆయన మదరాసుకి వస్తే బాగుంటుందని విద్యావేత్తలు అభిప్రాయపడ్డారు. ఒకసారి శేషాద్రి ఆచార్ కుంభకోణం వచ్చినప్పుడు, ఆయన యీ విషయాన్ని అయ్యరుగారితో ప్రస్తావించాడు.

"నేనెలా మదరాసుకి రాగలుగుతాను. నా ఉద్యోగం యిక్కడే గదా!" అయ్యరుగారన్నారు.

"మీరు తనక సమ్మతిస్తే, మిమ్మల్ని మదరాసులోని రాజధానీ కళాశాలకు బదిలీ చేయించేందుకు నేను ప్రయత్నిస్తాను. విద్యశాఖలో నా కందరు పరిచితులే. నాకు కావలసింది మీ అంగీకారం." ఆచార్‌గారు చెప్పారు.

అప్పట్లో మదరాసు రాజధానీ కళాశాలలో ఒక వృద్ధుడు తమిళ పండితుడు. ఆయన స్వస్థలం మదరాసే. తాను మదరాసు వెళ్ళడంవల్ల ప్రచురణలను త్వరిత గతిని తీసుకురావచ్చు. అయినా ఆ వృద్ధ పండితుడికి ఇబ్బంది కలిగించకూడదనే, ఉద్దేశంతో అయ్యరుగారు అసమ్మతిని తెలియజేశారు.

1902 వేసవి సెలవలలో, పారిసుకి చెందిన జ్యూలియన్‌విన్సన్ శిష్యుడు మదరాసు వచ్చాడు. విన్సన్, అయ్యరుగారూ చాలా కాలంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకుంటున్నారు.

విన్సన్ శిష్యుడు వచ్చినప్పుడు, లయొనెల్ బైబర్ట్ తంజావూరు సబ్ కలెక్టరుగా ఉండేవాడు. బైబర్టుకి ఫ్రెంచి విద్యార్థి అతిధి అయ్యాడు విన్సన్ అయ్యరుగారి తమిళ భాషాసేవను గురించి తరుచుగా ప్రస్తావిస్తూ వుంటాడని అతను బైబర్టుతో అన్నాడు.

తాను పాండిచ్చేరి, కారైక్కాల్ మొదలైన ప్రదేశాలు పర్యటించనున్నాననీ, చదువుకునేందుకు ఏదైన పుస్తకం ఇమ్మని జాగ్రత్తగా తిరిగి యిస్తాననీ ఫ్రెంచి విద్యార్థి అయ్యరుగారిని కోరాడు. ఆయన అతనికి పాత కాంచిపురాణం కాగితపు ప్రతిని ఇచ్చారు. అతను ఎంతో ఆసక్తితో అది చదివాడు ఆ ప్రతిని అతను పదిహేను రోజుల తర్వాత రెజిస్టరు పోస్టులో పంపించాడు.

తమిళ సాహిత్యాభిమాని అయిన ఆ ఫ్రెంచి యువకుడు సబ్ కలెక్టరుతో ప్రాచీన లిఖితప్రతుల్ని సేకరించి ప్రచురించడంలో గల యిబ్బందులు తెలియజేసే

వాడు. అలాగే ప్రపంచమంతట తమిళ సాహిత్యానికి గౌరవం కల్పించాలని అయ్యరుగారు కృషి చేస్తున్నారనీ తెలియజెప్పాడు ఈ ప్రశంస అచిరకాలంలోనే సత్ఫలితానికి దారి తీసింది. 1903, జనవరిలో ఏడవ ఎడ్వర్డు పట్టాభిషేకం సందర్భంగా తంజావూరులో ఒక మహాసభ జరిగింది. ఆ సభకు సబ్‌కలెక్టరు అయ్యరుగారిని ఆహ్వానించాడు. ఆయన తమిళ భాషకు చేస్తున్న సేవకు గుర్తింపుగా సబ్ కలెక్టరు ఆయనకి ఒక ప్రశంసా పత్రం బహూకరించాడు.

సంగకాలపు కృతులలో ఒకటి అయిన ఐంగురునూరుని అయ్యరుగారు పరిశోధించసాగారు. యాళ్‌ప్పాణం (జాఫ్నా) నుంచి ఆయనకో జాబు వచ్చింది. సంగ్రహంగా కనక ఆయన ఐంగురునూరుని ప్రచురిస్తే, మరికొన్ని గ్రంథాలను కూడా ప్రచురించవచ్చునని ఆ ఉత్తరంలో సూచించబడింది ఆ సూచనను పురస్కరించుకొని ఆయన 1902లో ఐంగురునూరు సంక్షిప్త ప్రచురణను వెలువరించారు. అది చూసి ఆ జాఫ్నా మిత్రుడు ఇలా వ్రాశాడు. 'మీరు మీ వ్యాఖ్యానాన్ని యింతగా సంగ్రహించి ప్రకటిస్తారని నేను భావించలేదు. ఈ విధంగా తమిళ సాహిత్యం ఒక నిధిని కోల్పోయింది. ఇందుకు నేను కారణభూతుణ్ణి, విచారిస్తున్నాను." 1903 జూనులో ఆ కావ్యపు సమగ్ర ప్రచురణ వెలువడింది. ఆ ప్రచురణను ఆయన కృతజ్ఞతా పూర్వకంగా త్యాగరాజ చెట్టిగారికి అంకిత మిచ్చారు.

# 9
# మదరాసులో

1903 వేసవిలో మదరాసు రాజధానీ కళాశాలలో తమిళ పండితుడుగా పని చేసే శ్రీనివాసాచారియార్ ఉద్యోగ విరమణ చేశారు. అప్పుడు అయ్యరుగారు పదిట్రుప్పత్తు పరిశోధనలో నిమగ్నులై వున్నారు. ఒకనాడు ఆయన్ని కలుసుకోడానికి ఆ కళాశాలాధ్యక్షులు జె. యం. హెన్స్‌మన్ ఆయన యింటికి వెళ్ళారు. తనకు విద్యాశాఖ డైరెక్టరుగారి వద్ద నుంచి ఒక వుత్తరం వచ్చిందనీ, అందులో అయ్యరుగారిని రాజధానీ కళాశాలకు బదిలీ చేసిన విషయం ఉందనీ హెన్స్‌మన్

ఆయనకి తెలియజేశాడు. అలాగే, కుంభకోణం కళాశాలలో ఆయన తర్వాత ఎవరిని నియమించాలో సలహా యిమ్మని అర్థించాడు.

అధ్యాపక వృత్తిలో తనకు కలుగుతున్న అభ్యున్నతిని చూసి అయ్యరుగారు సంతోషించారు, అంతా పరమేశ్వరానుగ్రహమని భావించారు. కాని 23 సంవత్సరాలు నివసించిన పట్టణం, చిరకాల మిత్రులు - అందరినీ విడిచి పెట్టి వెళ్ళడం ఆయనకి బాధగా తోచింది. అదీ కాక తిరువాడుదురైకి తరుచుగా వెడుతూ మఠాధిపతుల్ని కలుసుకునే అవకాశాలు తగ్గ నున్నందుకు ఆయన విచారించారు. కాని హెన్స్‌మన్ యిలా సలహా చెప్పాడు.

"మదరాసులో అయితే మీ ప్రచురణ కార్యక్రమానికి చాలా సహాయం లభిస్తుంది. ఇక్కడి నుంచి తరుచుగా మదరాసు వెడుతూ ప్రచురణల్ని పర్యవేక్షించడం కంటె అక్కడే వుండి పర్యవేక్షించడం సులభం."

అప్పట్లో తిరువాడుదురై మఠాధిపతులు శ్రీఅంబలవాణ దేశికర్. బౌద్యోపికంగా అయ్యరుగారికి అభ్యున్నతి కలిగినందుకు ఆయన ఎంతగానో సంతోషించారు. "మీరు మదరాసు వెళ్ళడం వలన ఎన్నో లాభాలున్నాయి. మా మఠంతో మీకు గల అనుబంధాన్ని బట్టి అక్కడ కూడా మా మఠానికి పేరు పెంపులు లభిస్తాయి. ఏ విధంగా చూసినా యీ బదిలీ మీకు లాభకరమే."అని ధైర్యం చెప్పారు.

ఒక మంచి రోజు చూసి అయ్యరుగారు మదరాసు చేరుకున్నారు. అక్కడ తిరువట్టీశ్వరన్ పేటలో నివసించే తమ పినతండ్రిగారి యింట్లో బస చేశారు. రాజధానీ కళాశాలలో చేరారు.

కుంభకోణం కళాశాలలో తమిళ తరగతిలో ఎత్తయిన వేదిక, మంచి మేజా, మంచి కుర్చీ మొదలైనవి ఉండేవి. కాని మదరాసు కళాశాలలోని తమిళ తరగతిలో అవన్నీ లేవు. అనగా ఇంగ్లీషు మొదలైన తరగతులలో వుండే వసతులు తమిళ తరగతిలో లేవు. ఒకే ఒక పాత మేజా వుండేది. ఈ విషయాన్ని కళాశాలాధ్యక్షులు బిల్డర్ బెల్‌గారికి వినయ పూర్వకంగా తెలియ జేశారు. వెంటనే మంచి వేదిక, మేజా కుర్చీ, బీరువా తమిళ తరగతిలో ఏర్పాటు చేయాలని ఆయన ఆదేశించాడు.

1904, జనవరిలో తిరువట్టీశ్వరన్ పేటలో పిళ్ళైయార్ కోవిల్ వీధిలోని అద్దె యింట్లోకి ఆయన మారాడు. జూన్‌లో పద్రుటుపత్తు ప్రచురించబడింది.

1905 ప్రారంభంలో అయ్యరుగారి తల్లి సరస్వతి అమ్మాళ్ కాలధర్మం చెందింది. పరామర్శించడానికి శ్రీనివాస అయ్యంగారు అయ్యరుగారి యింటికి వచ్చాడు. ఆయన వ్రాసిన మణిమేకలై కథా సంగ్రహాన్ని యం. యే. కి పాఠ్య పుస్తకంగా నిర్ణయించబడినట్లు అయ్యంగారు చెప్పాడు. పారలౌకిక క్రియలకు ఆ విధంగా డబ్బు సమకూడింది

అయ్యరుగారి నిజాయితీ, పరిశ్రమ, మృదువైన హాస్యం రాజధానీ కళాశాలా విద్యార్థుల్ని ఆకట్టుకున్నాయి. విద్యార్థుల అభిమానం చూరగొన్నారు. అది చూసి ఆయన సహచరులు కొందరు అసూయాగ్రస్తులయ్యారు. ఆయన తరగతిలో గోల చెయ్యమని దూరదృష్టి లేని విద్యార్థుల్ని వాళ్ళు ప్రోత్సహించారు. వాళ్ళు ఒక కర పత్రం కూడా అచ్చు వేశారు "నచ్చినార్ కిలియార్ (జీవక చింతామణి వ్యాఖ్యాత) తప్పులు చేశారు, శంకరాచార్యులు కూడా తప్పులు చేశారు. ప్రస్తుతం ఉ. వే. స్వామినాథ అయ్యరు ఆ మార్గమే అనుసరిస్తున్నారు" మహా బాధ పడుతూ ఒక విద్యార్థి ఆ కరపత్రాన్ని అయ్యరుగారికి యిచ్చాడు. అది చదివి ఆయన బాధ పడలేదు; కోపమూ చెందలేదు. మందహాసం చేశాడు. "ఈ అల్పుణ్ణి అందల మెక్కించారు. శంకరుడు, నచ్చినార్ కిలియారుల కోవలో నన్నూ చేర్చారు" అన్నాడు. విద్యార్థులు తమ బాధను మరిచిపోయి పెద్దగా నవ్వారు.

అయ్యరుగారు నిజానికి పరిశోధన - యంత్రం కాదు. ఆయనకి జీవితమూ సాహిత్యమూ ఏక సూత్రం. ఒకటి మరొకటికి దోహదకారి అని ఆయన అభిప్రాయం. సామాన్యులతో సంచరించేటప్పుడు ఎంతో సహనభావం ప్రదర్శించేవాడు అవకాశం లభించినప్పుడెల్ల భారతీయ సాహిత్య వైభవాన్ని మత సంప్రదాయాల ప్రశస్తిని వివరించేవాడు. ఈ సందర్భంలో ఆయన జీవితంలోని ఒక సంఘటన పేర్కొన దగింది. ఒక పోలీసు అధికారి ఆయనకి దగ్గరలో నివసించేవాడు. ఒక తమిళ భాషాభిమాని ఆ అధికారిని సమీపించి కావడిచ్చిందు, తిరుప్పుగళుల నుంచి కొన్ని గీతాలు చదివాడు. ఆ అధికారి పేరు జయసింగ్. ఆ గీతాలలోని శృంగారాత్మక భావాలు గ్రహించి ఉగ్రుడయ్యాడు. అలాంటి తమిళ గీతాల వల్ల పిల్లలు అపమార్గాలు పడుతున్నారనీ, వాటిని నిషేధించాలనీ అన్నాడు. ఈ విషయం తెలుసు కుని అయ్యరుగారు జయసింగ్ యింటికి వెళ్ళారు.

"రండి, రండి. ఏమిటి యిలా వచ్చారు" అంటూ అయ్యరుగారిని ఆహ్వానించి ఆయన్ని కూర్చోమన్నాడు.

"మీరు చాలా నిజాయితీ గలవారని విన్నాను. శృంగార ప్రధాన గీతాలను నిషేధించాలని మీరు భావిస్తున్నట్లు విని సంతోషించాను. మన సంస్కృతిని సరిగా అర్థం చేసుకున్న వారికే అలాంటి భావం కలుగుతుంది. అయినా సాహిత్యాన్ని మరో దృక్పథంతో పరిశీలించాలి. సంగయుగం నుంచి అలాంటి భావాలను కవులు ఆదరించారు. వారి కృతులలో సాహిత్య వైభవాన్నే కాని మరొక విషయాన్ని గ్రహించకూడదు."

అధికారి ప్రసన్నుడయ్యాడు. "కొందరు కవులు బాధ్యతా రహితంగా వ్రాస్తారు. అలా వ్రాసి యువకుల మనస్సుల్ని అవాంఛనీయ మార్గాలకు తిప్పుతున్నారు. అలాంటి వాఙ్మయాన్ని ప్రచారంలోంచి ఎలా తప్పించాలో తెలియజేస్తే, మీరు నాకు సహాయం చేసిన వారవుతారు" అన్నాడు.

"నేనా విషయం చర్చించేందుకే మీ వద్దకు వచ్చాను. మరి, మీకు తీరిక వుంటే మనవి చేస్తాను."

"మీరు మహా విద్వాంసులని విన్నాను. మీ మాటలు వినడం కంటె నాకు ముఖ్యమైన పని మరొకటి ఏముంటుందని?" అన్నాడు అధికారి వినయంగా.

"మీరు తమిళ విరోధులని కొంత మంది పండితులు నాతో అన్నారు. అలా భావించడం తగదని నేనన్నాను. ప్రాచీన సాహిత్యాన్ని పరశురామ ప్రీతి చేయాలని మీరన్నట్లు వాళ్ళు చెప్పారు. వాళ్ళు మిమ్మల్ని అపార్థం చేసుకున్నట్లు నేను భావిస్తున్నాను. అందు వల్ల ఈ విషయమై మీతో స్వయంగా మాట్లాడుదామని నేను వచ్చాను."

"బహుశః పండితులకు నేనంటే కోపంగా ఉండవచ్చు. స్త్రీలను అసభ్యంగా వర్ణించే కావడిచ్చిందు, తిరుప్పుగళ్ వంటి కృతుల్ని ప్రచారంలోంచి తప్పించాలనే నేనభిప్రాయపడుతున్నాను."

"మీరన్నట్లు ఈ కృతులలో స్త్రీల వర్ణనలున్నాయి. మనం వాటిని మాత్రమే చదివి తృప్తి చెంద కూడదు. ఆ కృతుల్ని కనక సమగ్రంగా చదివితే, కవి అలాంటి భావాల్ని విమర్శిస్తున్నాడనే విషయం అవగతమవుతుంది. నవరసాలలో

శృంగారం ఒకటి. సంస్కృత కావ్యాలలోనూ శృంగారం వుంది. స్త్రీ వర్ణన లేకుండా ఏ సాహిత్యమూ మానజాలదు. అతి ప్రాచీనమైన సంగకాలపు కృతుల్ని నేను ప్రచురించాను అందుకే తమిళులు నన్ను చాలా గౌరవిస్తున్నారు సంగ సాహిత్యంలోనూ స్త్రీ వర్ణన లేకపోలేదు. వాటిని చదివేటప్పుడు పఠితకు సాహిత్య సౌందర్యమూ సందర్భ శుద్ధి ప్రధానంగా స్ఫురణకు వస్తాయి. మీరు మొత్తం సాహిత్యాన్ని దగ్ధం చెయ్యాలని భావిస్తున్నట్టు చెప్పారు. అలా అయితే సంస్కృత కావ్యాల విషయమూ యిందుకు భిన్నం కాదు. ఈ విధంగా కనక మీరు సాహిత్యాన్ని నాశనం చెయ్యదలుచుకుంటే, సంస్కృత సాహిత్యం గాని తమిళ సాహిత్యంగానీ ఏదీ మిగలదు."

"మీరు చెప్పడం బట్టి చూస్తే, అన్ని కావ్యాలూ శృంగార రస ప్రధానాలుగానే కనిపిస్తున్నాయి !" ఆశ్చర్యం ప్రకటించాడు అధికారి.

"అశ్లీలం వేరు. రసానందం వేరు. మానవ జీవితంలో ప్రేమ ముఖ్యమైన భావం. కావ్య పురాణాలు ప్రేమను అభివర్ణిస్తాయి. భగవంతుడ్ని ప్రియునిగాను. తమను ప్రేయసిగాను, భావించుకుని ఆళ్వార్లూ నాయన్మారులూ గీతాలు పాడారు, వాటిలోనూ శృంగార రసం ఉంది "

"అలాగా ! తేవారం, తిరువాచకంలలో కూడా శృంగార మున్నదా?" ఆశ్చర్య పోతూ అధికారి ప్రశ్నించాడు

"ఉంది. వివిధ భక్తి రచనలలోనూ చివరికి దివ్య ప్రబంధంలోనూ శృంగారం వుంది. భగవంతుని మీది భక్తిని ప్రేమగా మలచుకుని అనగా మధుర భక్తిని ఆశ్ర యించి-వాళ్ళు గీతాలు సంతరించారు దేహాత్మల అనుబంధాన్ని శృంగార రసాత్మ కంగా చిత్రించడం భారతీయ సంప్రదాయం. అశ్లీలమనే ఉద్దేశంతో సాహిత్యాన్ని విసర్జించకూడదు "

"ఇదంతా నాకు కొత్తగా వుంది" అని గొణిగాడు అధికారి.

"భారతీయ రసతత్త్వం పరిశీలించే తీరిక మీకు వుండకపోవచ్చు. గ్రామా లలో స్త్రీలు రవికలు ధరించరు. కాయగూరలు అమ్మేవారు, పెరుగు అమ్మేవారు ఇంక మరికొందరు అలాగే కనిపిస్తారు. చీరలు మాత్రమే ధరిస్తారు. అయినా వారి వేషధారణలో దోషమేమీలేదు. చూసేవారి కళ్ళల్లోనే ఆ దోషముంది."

"మీరన్నది నిజమే."

"మరో విషయం. మీరు గుడికి వెడతారుగదా."

"అవును."

"అక్కడ మీరు దేవతామూర్తుల్ని చూశారు గదా. గోపురంమీది బొమ్మల్ని చూశారా? స్త్రీ మూర్తిని అంగాంగంగా చెక్కినా, ఎవ్వరికీ నీచభావాలు స్ఫురించవు. తల్లి రొమ్ముమీద ఆడుకునే పిల్లవాడికి అలాంటి భావాలు అసలు రావు. ఇదేమీ కొత్త సంప్రదాయంకాదు. ప్రణయంద్వారా భగవద్దర్శనమనే తత్వంమీద భారతీయ సంస్కృతి ఆధారపడివుంది. అది తెలుసుకోకుండ, ఏవో కొన్ని వర్ణనల్నిమాత్రమే పరిశీలిస్తే, సంస్కృత, తమిళ సాహిత్యాలను సముద్రంలో పాతిపెట్టవలసిందే. దేవతా విగ్రహాల్ని ధ్వంసం చెయ్యవలసిందే."

"అయ్యో, దయచేసి అలా అనకండి సరిగ్గా తెలియని దోషంవల్ల అలా అన్నాను. మీరు నా అజ్ఞానాన్ని తొలగించారు. సత్యం కనుగొనేలాచేశారు, మీకు నేను కృతజ్ఞుణ్ణి." అన్నాడు జయసింగ్. తదాదిగా భారతీయ సాహిత్యాన్ని నాశనం చెయ్యాలని ఆయన మాట్లాడేవాడు కాదు.

మహా విద్వాన్ మీనాక్షి సుందరంపిళ్లైగారి త్యాగరాజలీల అనే అనువాద కృతిని ప్రచురించడం ఆ రోజుల్లో అయ్యరుగారి ముఖ్య ప్రచురణలలో ఒకటి. తిరువారూరులో వేంచేసివున్న త్యాగరాజస్వామివారి లీలల్ని 360 కథలతో అభివర్ణించడం జరిగింది. పిళ్లైగారు వాటినన్నిటినీ అనువదించాలని అభిలషించారు. కాని 14 కథల్ని మాత్రమే అనువదించగలిగారు. ఆ పద్యానువాదాన్ని ప్రస్తుతం అయ్యరుగారు ప్రచురించారు.

1906 వ సంవత్సరం మొదటి తేదీ. విభిన్న వృత్తులకు చెందిన ప్రముఖులకు ప్రభుత్వం పట్టప్రదానంచేసే సమయం. ఆ రోజు ఉదయం అయ్యరుగారి మిత్రుడు గంగాధరశాస్త్రి చాలా సంతోషంతో వచ్చాడు. వస్తూనే "మేమంతా సంతోషించాము. మా సంతోషానికి అవధిలేదు" అన్నాడు. ఆయనకేమీ అర్థం కాలేదు. అది చూసి శాస్త్రి ఆశ్చర్యపోయాడు. "మీకు మహా మహోపాధ్యాయ పట్టం ఇచ్చారు." హర్షించదగిన విషయమది.

## 45 ఉ. వే. స్వామినాథ అయ్యరు

అయ్యరుగారికి ప్రశంసలు వచ్చిపడ్డాయి. "మీకు మహా మహోపాధ్యాయ పట్టం యిచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను. మీకది వస్తుందని నాకు తెలుసు" అని న్యాయమూర్తి మణి అయ్యరు వ్రాశారు.

అంతవరకు ఆ పట్టం ఒక్క సంస్కృత విద్వాంసులకే యిచ్చేవారు. ఆ పట్టాన్ని మొదటిసారిగా ఒక తమిళ పండితుడికి యిచ్చి, ప్రభుత్వం తన్ను తాను గౌరవించుకుంది.

ఆ యేడు వేల్సు యువరాజూ ఆయన భార్య మదరాసు వచ్చారు. జమీందారులూ, మహారాజులూ రావడంతో, మదరాసు నగరంలో పండగ కోలాహలం కనిపించింది గవర్నరుగారి నివాసంలో ఒక దర్బారు జరిగింది. భారతీయులు చాలామంది నివసించే మదరాసు నగర ప్రాంతాన్ని పూర్వం 'బ్లాక్ టౌన్" అని ఇంగ్లీషువారు వ్యవహరించే వారు. ఆ మాట స్థానికులకు కర్ణ కఠోరంగా వినిపించేది. యువరాజు రాక సందర్భంగా ఆ పేరుకి బదులుగా జార్జిటౌన్ అనే పేరు పెట్టడం జరిగింది. ఆ సమావేశంలో చాలామంది విద్వాంసులకు పట్టాలు బహుమతులూ ఇచ్చారు అయ్యరు గారికి స్వర్ణ కంకణం బహూకరించారు.

మహా మహోపాధ్యాయ పట్టం లభించిన సందర్భంగా, అయ్యరుగారిని సన్మానించే నిమిత్తం ఆ సంవత్సరం మదరాసు రాజధానీ కళాశాలలో బ్రహ్మాండమైన సభ ఒకటి జరిగింది. మహాకవి సుబ్రహ్మణ్య భారతి ఆ సభకు హాజరయ్యాడు అప్పట్లో ఆయన స్వదేశ మిత్రన్ అనే పత్రికకు సహాయ సంపాదకుడుగా ఉండేవాడు, ఆయన పద్యత్రయం చదివాడు. సభ జరుగుతూవుండగా, ఆయన అప్పటికప్పుడు వ్రాసిన పద్యాలవి.

సవితలో కాంతి, తేనెలో తీపి కలదనీ
దేవతలు చిరంజీవు లనీ
ఎవరైనా ప్రశంసిస్తారా?
కుంభముని అనదగిన స్వామినాథ పండితుడు
కీర్తి గడించినందుకా
ఇంత సంబరం?

తమిళ ప్రశస్తి తెలియని అన్యులు
ప్రకృతం మన పరిపాలకులైనా
కుంభకోణం స్వామినాథుని గౌరవించారు
మహా మహోపాధ్యాయ బిరుదమిచ్చి-
పాండ్యుల కాలంలో జీవించివుంటే
ఈ పండితునికి ఇంకెంత గౌరవమో!

మదిని విచారించకు
నిధి లేదనీ సౌఖ్యాలు లేవనీ
కుంభకోణం స్వామినాథసూరి!
తమిళ భాష మనినంత! కాలం
తెలుస్తుంది నీకు, కవుల ప్రశంస
లభిస్తుంది నీకు, వారి కృతజ్ఞత
చిరంజీవివయ్యా నీవు!

# 10

# నిరాడంబర జీవితం, నిరుపమాన పాండిత్యం

సుబ్రహ్మణ్య భారతి సహేతుకంగా పేర్కొన్నట్లు, అయ్యరుగారు ఆడంబర రహితంగా జీవించారు. అయితే అయన తన కాలాన్నీ ధనాన్నీ తమిళ సాహిత్య పరిశోధనకు బహుధా వినియోగించారు. ఏది యెలా ఉన్నా, నిరాడంబర జీవితానికీ నిస్తుల పాండిత్యానికీ ఆయన్ని ఆయన మిత్రులూ బంధువులూ చాలా గౌరవించారు ఈ సందర్భంగా ఆయన నివసించిన అద్దె యింటికి సంబంధించిన ఒక ఉదంతం పేర్కొనదగింది.

విద్యార్థులకోసం తాను వ్రాసిన పుస్తకాన్ని సరి చూసి యివ్వవలసిందిగా అయ్యరుగారి సహచరుడు ఒకాయన అయన్ని కోరాడు ఆయనకి తీరిక లేకపోవడం వల్ల, తన సహచరుడికి సహాయం చెయ్యమని ఆయన తన కొడుకుని ఆదేశించాడు.

ఆ విషయమై ఆ సహచరుడు ఆయన యింటికి తరుచుగా వస్తూపోతూ వుండేవాడు. ఒకసారి ఆ మిత్రుడు యింటి యజమాని దగ్గరికి వెళ్ళి, "ఎందుకు అంత తక్కువ అద్దెకు యిల్లు యిచ్చారు"? అని అడిగాడు. ఆయనకి అయ్యరుగారంటే చాలా గౌరవం. అందువల్ల ఆ ప్రశ్న ఆయనకి కోపం తెప్పించింది.

"ఈ యిరవై రూపాయలుకూడా తీసుకోవడం ఒకవేళ తప్పు కావచ్చు. ఆయన మా యింట్లో అద్దెకున్నందుకు నేను ఆయనకి ఇరవై రూపాయలు ఇవ్వాలి. ఆయన చాలా గొప్పవాడు. ఆయన అద్దెకు వుండడంవల్ల, మా యిల్లు ఒక గుడిగా, తయారయింది. ఆయన్ని చూడడానికి విద్వాంసులూ ప్రముఖులూ ఎందరో యిక్కడికి వస్తున్నారు. ఆయనంతట ఆయన ఖాళీచేస్తే తప్ప, నేను మాత్రం ఆయన్ని యిల్లు ఖాళీ చెయ్యమనను."

అయినా ఆ సహచరుడు గృహయజమానిని విడిచిపెట్టలేదు. మంచిధరకు ఇంటిని విక్రయించరాదా? అని పురిగొల్పాడు. ఆ గోల భరించలేక ఈ యింటిని మీరే కొంటారా? అని గృహయజమాని అయ్యరుగారిని అడిగాడు కుంభకోణంలో ఆయనికి స్వగృహం ఉంది. కనుక మదరాసులో ఇల్లు కొనాలని ఆయన అనుకోలేదు పైగా అందుకు సరిపడ్డ డబ్బుకూడాలేదు. కొనలేనని కృతజ్ఞతా పూర్వకంగా బదులు చెప్పాడు.

ఎలాగయితేనేం, ఆ యింటిని గృహయజమానిచేత 4,500/-లకు బేరం పెట్టించాడు, ఆ సహచరుడు. ఆ విషయం అయ్యరుగారికి తెలిసింది ఆయన ఆందోళన చెందారు కొత్త చోటికి పుస్తకాలను వ్రాతప్రతుల్ని తరలించడం అంత సులభమైన పనికాదు. ఆ కొత్త యిల్లు తన కార్యక్రమాలకు అనువైనదిగా వుంటుందో వుండదో! వీధి అరుగుమీద కూర్చొని ఆయన ఒకనాడు ఆలోచనలో పడ్డాడు. అప్పుడు గృహయజమానికి పరిచితుడైన ఒకాయన ఆ దారిన వెడుతున్నాడు ఆయన్ని పిలిచి అయ్యరుగారు ఇలా అన్నారు.

"మీ మిత్రులు ఈ యింటిని అమ్మకానికి పెట్టినట్లు, కొంత సొమ్ము బజానా పుచ్చుకున్నట్లు విన్నాను. నాకీ విషయం చెపితే, నేనే కొనేవాణ్ణికదా!"

"ఆయన మీతో యీ సంగతి పోయిన సంవత్సరం చెప్పారటగా, మీరందుకు యిష్టపడకపోయేసరికి, మరోచోట మీరు పెద్ద యిల్లు కడుతున్నారని ఆయన అనుకున్నాడు"

"కొనాలని అప్పుడు నా కనిపించలేదు. కాని యిప్పుడు కొనాలని అను కుంటున్నాను. నేను ఒక వంద ఎక్కువ యిస్తాను. ఎలాగయినా మీరు నాకీ యిల్లు యిప్పించాలి. మీకూ నేను సహాయం చేస్తాను."

ఆ సాయంకాలమే గృహయజమానికి పరిచితుడైన ఆ వ్యక్తి అయ్యరుగారిని కలుసుకున్నాడు, "మీకో శుభవార్త చెపుతాను. గృహయజమాని తీసుకున్న బజానా తిరిగి యిచ్చేశాడు. ఇల్లు మీకే అమ్మాలని నిశ్చయించుకున్నాడు." అని చెప్పాడు.

ఆయన చాలా సంతోషించాడు. ఈ విషయం అంత సులభంగా పరిష్కార మవుతుందని ఆయన అనుకోలేదు. ఒక నెల గడిచిన తర్వాత, ఆ యింటిని కొన్నాడు. కుంభకోణం కళాశాలలో తన ఉద్యోగానికి సహాయపడిన త్యాగరాజ చెట్టియార్ స్మృత్యర్థంగా ఆయన యింటికి "త్యాగరాజవిలాసం" అని పేరుపెట్టాడు. ఇద్దరు తమిళ విద్వాంసులపేర్లకు సంబంధించిన ఆ గృహం నేటికీ తమిళ భాషాభి మానుల ఆదరభావానికి పాత్రమవుతున్నది.

అయ్యరుగారి ప్రచురణ కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగుతున్నది. 1906లో వేంబత్తూరార్ తిరువిళైయాడల్ పురాణాన్ని పరిశోధనాంశాలతోనూ పద పట్టికతోనూ అయ్యరుగారు ప్రకటించారు. ఆ ప్రచురణకు పాండిత్తురై తేవర్ ఆర్థిక సహాయం చేశారు మధురై తమిళ సంఘంవారి పరిశోధన ప్రచురణ అయిన సెందమిళుకి వ్యాసాలు ధారావాహికంగా వ్రాయమని ఆయన కోరాడు. చేతి నిండుగా పని వుండడం మూలాన అయ్యరుగారు తటాపటాయించారు కాని ఆయన రచనల వల్లనే పత్రికకు పేరు ప్రఖ్యాతులు లభించగలవని తేవర్ పేర్కొన్నాడు. అందువల్ల ఆయన అప్పుడు పరిశోధిస్తున్న తిరువాదూర్ ఉలా అనే కృతిని ధారావాహికంగా సెందమిళులో ప్రచురించడానికి ఆయన నిశ్చయించాడు.

ఆ తర్వాత ఆయన మీనాక్షిసుందరంపిళ్లైగారి తనియూర్ పురాణం, మణ్ణి పడిక్కరై పురాణాలను ప్రచురించారు. 1907 డిసెంబరులో కొత్త విషయాలు కొన్ని చేర్చి జీవక చింతామణి రెండవ ముద్రణను వెలుగులోకి తెచ్చారు.

అయ్యరుగారి పరిశోధన ఇతర విషయాలకు కూడా విస్తరించింది. ఉదాహర ణానికి, ఆయనకి 1908 లో ఒక ఉత్తరం వచ్చింది. అది జైలు అధికారులు తణిఖీ చేసి పంపించిన వుత్తరం. జైలునుంచి తనకు ఎవరు ఉత్తరం వ్రాసి వుంటారా అని ఆలోచిస్తూ ఆయన కవరు తెరిచారు.

ఆ రోజుల్లో దక్షిణ భారత ప్రథమ నౌకానిర్మాత, ప్రముఖదేశభక్తుడు అయిన వ. ఉ. చిదంబరంపిళ్ళైగారు కోయంబత్తూరు కారాగృహంలో శిక్షననుభవిస్తున్నారు. ఆయనే ఆ ఉత్తరం వ్రాసింది. తిరుక్కురళ్ గురించి ఆయన చేస్తున్న అధ్యయనం, ఆ గ్రంథాన్ని ఆంగ్లంలోకి తాను అనువదిస్తున్న విషయం—వాటిని గురించి ఆ ఉత్తరంలో ఆయన వ్రాశాడు. ఆయన వెలిబుచ్చిన కొన్ని సందేహాలకు అయ్యరుగారు వెంటనే ప్రత్యుత్తర మిచ్చారు.

గ్రంథ పరిష్కరణ, ప్రచురణ, కొనసాగుతున్న ఆ రోజులలో ముద్రణాలయాలవల్ల ఆయన జటిల సమస్యలు ఎదుర్కొనవలసివచ్చింది. ఏ ఒక్క అచ్చుకూటమూ ఆయనకి పరిపూర్ణమైన తృప్తి ఇవ్వలేదు. ఈ విషయం తెలుసుకున్న తిరువాడుదురై మఠాధిపతులు అంబలవాణ దేశికర్ ఆయనకి సహాయం చేద్దామనుకున్నారు. అయ్యరుగారికి సొంత ముద్రాక్షరశాల ఉండడం మంచిదని ఆయన అనుకున్నాడు. ఆయన తిరువాడుదురైకి వచ్చినప్పుడు, దేశికర్ యీ విషయం ప్రస్తావించాడు.

"పుస్తక ముద్రణ విషయంలో మీరు చాలా యిబ్బందులు పడుతున్నట్లున్నారు. మీకు కనక సొంత ప్రెస్సువుంటే, మీ ముద్రణ కార్యక్రమం త్వరిత గతిని సాగుతుంది. సకాలంలో మీరు పుస్తకాలు ముద్రించవచ్చు. మీకు నేను అయిదువేలిస్తాను. దాంతో మీరు ముద్రాక్షరశాల ఒకటి కొనండి. మీరనుకున్నట్టుగా పుస్తకాలు ప్రచురించనూవచ్చు."

ఆయన వెంటనే ప్రత్యుత్తరం ఇవ్వలేదు. ఒక రోజంతా ఆలోచించి, ఆయన దేశికరుతో మాట్లాడారు.

"పూజ్యపాదులైన తమకు నా మీద గల ఆదర భావం నాకు తెలుసు. ముద్రాక్షరశాలల వారివల్ల నేను చాలా యిబ్బందులు పడుతున్న మాట వాస్తవమే. నేను కాగితం, బైండింగు పరికరాల విషయంలో చిక్కులకు గురి అవుతున్నాను. ప్రెస్సుకూడా వుంటే, దాని నిర్వహణ విషయంలోనూ సమస్యలు ఎదుర్కొనవలసి వస్తుంది. సిబ్బంది జీతాలు సరే సరి. కాగా, వీటివల్ల నేను పరిశోధనకు వినియోగిస్తున్న కాలం తగ్గిపోతుంది. కనుక తమ ఆజ్ఞను మన్నించనందుకు నన్ను క్షమించాలి." మఠాధిపతి సరే అని, ఆ తర్వాత ఆ విషయం ప్రస్తావించలేదు.

కూర్చున్న చోటునుంచి కదలని విద్వాంసుడు కాదు ఆయన. ఆయన విస్తృతంగా పర్యటించాడు. ఆయా ప్రదేశాలకు గల పౌరాణిక చారిత్రక సాహిత్యాత్మక ప్రాధాన్యాన్ని చక్కగా అధ్యయనంచేశాడు. ఆయన దక్షిణ భారత సంస్కృతికి జంగమ విజ్ఞాన సర్వస్వం. అప్పటి గవర్నరుగారయిన కార్మైకేల్ ప్రభువు పురాతత్త్వశాఖను దర్శించాలని అభిలషించాడు. అపూర్వ విగ్రహాలు, కళాఖండాలు మొదలైన వాటిని గురించి గవర్నరుకి ఎలా వివరించడమా అని ఆ శాఖాధిపతి మధన పడసాగాడు. ఆయన అయ్యరుగారి సహాయాన్ని అర్థించాడు. ఆయన సరే అన్నాడు గవర్నరుగారు విజయం చేసినప్పుడు ఆయన కూడా హాజరయ్యాడు. ఆయా విగ్రహాల చారిత్రక పౌరాణిక ప్రాధాన్యాన్ని గవర్నరు దంపతులకు ఆయన వివరించసాగాడు. ఆయన వివరణను ఆంగ్లంలోకి అనువదించి అతిథులకు తెలియజేశారు. గవర్నరుగారు చాలా సంతోషించారు.

గవర్నరుగారిని ఫోటో తీయాలనుకున్నారు. అప్పుడాయన అర్థవంతమైన చక్కని వివరణ చేసిన "పండిట్" (పండితుడు) కోసం అటూ యిటూ చూశాడు. ఛాయా చిత్రానికి అయ్యరుగారు తన సరసన ఆసీనులు కావాలని గవర్నరుగారు అభిలషించారు. అయ్యరుగారి భావ ప్రకటన, జాతి - భాషాపరమైన అంతరాలను అధిగమించింది.

1912 లో, యం. ఆర్. యస్. రామనాథన్ చెట్టియారు ఆయన సహోదరులు శ్రీ కాళహస్తి ఆలయం కుంభాభిషేకం బ్రహ్మాండంగా జరిపించారు. ఆ సందర్భంగా చెట్టియారు సోదరులు శ్రీ కాళహస్తి ఆలయాన్ని గురించి ఒక కొత్త పుస్తకం ప్రచురించదలచారు. అదృష్టవశాత్తు, అప్పుడు అయ్యరుగారు తిరుకాళత్తి పురాణం ప్రచురించే సన్నాహంలో ఉన్నారు. ఆ సందర్భంగా అది ప్రచురించబడడం సముచితంగా ఉంటుందని భావించారు. తమిళ సాహిత్యంలో కణ్ణ(న్న)ప్పను గురించి లభ్యమయ్యే వివిధ వృత్తాంతాలను ఆయన సంకలనంచేశారు. ఆ సంకలనం ఆయన విద్వత్తుకి నికషోపలం. ఆయన కుంభాభిషేకానికి హాజరై, ఆ ప్రచురణను ఆవిష్కరించారు.

1915 ఫిబ్రవరికి అయ్యరుగారికి అరవై యేండ్లు నిండాయి. షష్ట్యబ్ది పూర్తిని వైభవోపేతంగా జరపాలని మిత్రులు అభిలషించారు కాని ఆయన అలాంటి మహోత్సవానికి వైముఖ్యం తెలిపారు. అందుకు ప్రత్యామ్నాయంగా

ఆయన శ్రీ కాళహస్తిలో ప్రశాంతంగా కొన్ని రోజులు గడిపారు. శ్రీ కాళహస్తీశ్వరుని సందర్శించారు. ఆ తర్వాత రెండేళ్ళకు ఆయన భార్య కాలధర్మం చెందింది.

రాజధానీ కళాశాలలో ఆయన గడిపిన చివరి సంవత్సరాలలో పరిశోధనా వ్యాసాంగం విస్తృతిచెందింది. సంగం కృతి అయిన పరిపాడలుని ఆయన చక్కగా పరిష్కరించి ప్రచురించారు. పరిమేలళగర్ వ్యాఖ్యానం ప్రకారం అది డెబ్బై ఫ పద్యాల సంకలనం. ఆయన నిర్విరామంగా కృషిచేసినా, ఆయనకి సమగ్ర కృతి లభ్యంకాలేదు. లభ్యమైన ఇరవై రెండు పద్యాలను పురస్కరించుకుని ప్రాచీన తమిళులు పూజించిన దేవతామూర్తుల్ని గురించీ, సంగకాలపు కొన్ని సాంఘిక మత విషయాలను గ్రహించవచ్చు.

అయ్యరుగారి విద్వత్తు ప్రస్తుతం తమిళనాడుకే పరిమితం కాలేదు. వారణాశి లోని భారత ధర్మ మహా మండల్ వారు భారతీయ సంస్కృతికి ఆయన చేసిన సేవను గుర్తించి, ఆయనకి "ద్రావిడ విద్యాభూషణం" అనే బిరుదు ఇచ్చి సత్కరించారు.

# 11
# ఉద్యోగ విరమణ

1919 లో అయ్యరుగారు మదరాసు రాజధానీ కళాశాలనుంచి ఉద్యోగ విరమణ చేశారు. ఆయన్ని మరికొంత కాలం ఉద్యోగం చెయ్యమని అధికారులు కోరారు. కాని ఆయన వినయ పూర్వకంగా తన అసమ్మతిని తెలిపారు. కళాశాలాధ్యక్షులవద్ద సెలవు తీసుకునేటప్పుడు, తన తర్వాత నియమితులయ్యే ఆయన్ని సమర్థుడుగా చూసి నియమించాలనీ, ఆయనవల్ల తమిళశాఖ ఇంకా అభివృద్ధి చెందాలనీ అయ్యరుగారు ఆశించారు ఆయన సలహాను కోరగా, ఆయన ఇ.వి. అనంతరామ అయ్యరు పేరుని సూచించారు ఆయనే నియమితు డయ్యాడు.

1919 ఏప్రియలులో నోబెల్ బహుమతి గ్రహీత అయిన రవీంద్రనాథ ఠాకూరు మదరాసుకి విజయం చేశారు. ఆయన్ని టి యస్ రామస్వామి అయ్యరు గృహంలో

అయ్యరుగారు కలుసుకున్నారు. రవీంద్రునికి ఆయన సాహిత్య సేవ గురించి చెప్పారు. పరిష్కరణకు ఆదర్శము లనదగిన అయ్యరుగారి ప్రచురణల విషయం తెలుసుకోగానే ఆ మహా కవి విస్మయం చెందాడు. "ఇవన్నీ మీరెలా చెయ్య గలిగారు?" అని ఆయన అడిగాడు. తాళపత్ర ప్రతుల కోసం తాను మారుమూల-గ్రామాలు సైతం పర్యటించాననీ, ఆ ప్రతులకు కాగితపు ప్రతులు తయారుచేశాననీ, వివిధ ప్రత్యంతరాలతో వాటిని సరి చూశాననీ ఆ తర్వాత పరిష్కరణకు పూను కున్నాననీ ఆయన వివరించాడు రవీంద్రుని ఆశ్చర్యం మరీ ఎక్కువయింది అయ్యరుగారి యిల్లు చూడాలనుకున్నాడు ఆ సాయంకాలమే ఆయన త్యాగరాజ విలాసం దర్శించాడు చక్కగా అమర్చబడిన తాళదళ గ్రంథాలను, కాగితపు ప్రతులను చూసి అయ్యరుగారిని ప్రశంసించాడు. తాళపత్రాల మీద ఎలా వ్రాస్తారో ఆయన వ్రాసి చూపించారు. తిరువేట్టీశ్వరన్ పేట మొత్తానికే యిది చెప్పుకోదగిన సంఘటన! అయ్యరుగారిని అంతకు మునుపు చూడనివారు కూడా, ఆయన రోడ్డు మీద కనిపిస్తే నమస్కరించసాగారు

ముసలితనం పైబడేకొద్దీ సహజంగా రచయిత, పాఠకుడు అయిన అయ్యరు గారికి బాధ్యతలు ఎక్కువ కాసాగాయి. కుటుంబ సమస్యల పరిష్కరణకూ, తిరువాడుదురై మఠం తాలూకు వాదాల పరిష్కరణకూ, ఆయన సహాయాన్ని అర్థించడం జరిగింది. 1920 లో మఠాధిపతులైన అంబలవాణ దేశికర్ పరమ పదించారు. అప్పుడు అంతవరకూ మేనేజరుగా వ్యవహరించిన వైద్యనాథ తంబిరాన్ కొత్త మఠాధిపతి అయ్యారు. ఆయన ఆధిపత్యాన్ని సవాలుచేస్తూ కొందరు న్యాయ స్థానానికి వెళ్లారు. ఆ వాదం సద్దుమణిగేంతవరకు అయ్యరుగారిని తనతోపాటు ఉండమని ఆయన కోరాడు. అలాగే ఆయన తిరువాడుదురైలో రెండు వారాలు గడిపాడు సోమరిగా కూర్చోలేదు. మఠంలో ఉన్న తాళదళ ప్రతులు, గ్రంథాలు మొదలైన వాటిని సక్రమంగా అమర్చి ఒక గ్రంథాలయంగా రూపొందించారు. తాను బోధించిన చోట ఒక పాఠశాల ప్రారంభించారు. ఆ దృశ్యం చూసి, మఠానికి వచ్చేవారందరూ సంతోషించారు; మీనాక్షి సుందరంపిళ్లైగారి రోజుల్ని స్ఫురణకు తెచ్చుకున్నారు.

వేల్సు యువరాజు 1922, జనవరిలో మదరాసుకి విజయం చేశారు. ఆ సందర్భంగా తమిళ, సంస్కృత విద్వాంసులకు సన్మానం చెయ్యాలని ప్రభుత్వం

అభిలషించింది. అయ్యరుగారు మదరాసు వచ్చి, స్వయంగా ఖిల్లత్ అందుకున్నారు. తిరువాడుదురైలో కొత్త మఠాధిపతి అస్వస్థుడై దివంగతు డయ్యాడు. వైద్యలింగ దేశికర్ కొత్త మఠాధిపతి అయ్యాడు. పరిశోధన వ్యాసంగం సత్తనడక కావడంతో, అయ్యరుగారు తిరిగి మదరాసు చేరుకున్నారు.

మదరాసు చేరుకోగానే, పెరుంగదై పరిశోధనలో ఆయన నిమగ్నుడయ్యాడు. ఆయన సేకరించిన అమూల్య తాళదళ ప్రతులలో అది ఒకటి. దానికి కొంగువేళ్ మాక్కదై అనే నామాంతరం ఉంది. అయిదేళ్ళకు పైగా నిర్విరామంగా పరిశ్రమించినా, ఆయనకి ఆ వ్రాతప్రతి సమగ్రంగా లభించలేదు లభ్యమైనంతవరకు ప్రచురించాలనుకున్నాడు, తుది భాగం లభ్యంకాలేదు. బృహత్ సంహితలోని విషయాలను సంస్కృత విద్వాంసుల సహాయంతో గ్రహించి, ఆయన విపులమైన గ్రంథం తయారుచేశారు. 1924 లో పెరుంగదై పరిష్కరణ వెలువడింది. అది పండితుల ప్రశంశను చూరగొన్నది. అయ్యరుగారు లబ్ధ ప్రతిష్ఠులయ్యారు.

ప్రాచీన తమిళ సాహిత్యం వెలుగు చూసేకొద్దీ, వివిధ కళాశాలలలోని తమిళ శాఖలకు గౌరవం ఇనుమడించింది. చిదంబరంలో తమిళ, సంస్కృతాల అధ్యయనానికి కళాశాలలు ప్రారంభించడానికి రాజా అణ్ణామలై చెట్టియారు ఉద్దేశించారు. తమిళ కళాశాలధ్యక్ష పదవికి అయ్యరుగారు అర్హులని ఆయన అభిప్రాయపడ్డారు. ఆయన్ని ఒప్పించడానికి చెట్టియారు ప్రయత్నించారు. స్వయంగా ఆయనే అయ్యరుగారిని కలుసుకున్నారు. చివరికి ఆయన తన అంగీకారం తెలిపారు. ప్రతిరోజూ నటరాజస్వామి వారిని దర్శనం చేసుకోడానికి వీలవుతుందని ఆశించారు. ముఖ్యంగా ఆలయ పారంపర్య ధర్మకర్తలైన దీక్షితర్లు చాలా సంతోషించారు ఎందుకంటే ఆయన మహా విద్వాంసుడే కాక శివభక్తుడు కూడా.

1924, జూలైలో అయ్యరుగారు చిదంబరం చేరారు. ఆయన ఉండడం కోసం తగిన వసతులు కల్పించబడ్డాయి. ఆయన నివాసంలోనే మీనాక్షి తమిళ కళాశాలకు ప్రారంభోత్సవం జరిగింది మీనాక్షి ఆర్ట్స్ కళాశాలాధ్యక్షులైన నీలకంఠ శాస్త్రి ఆయనకి కావలసిన సహాయం చేశారు.

1925, జూను 8 న మధుర తమిళ సంగం 24 వ వార్షికోత్సవం జరుపుకుంది. సి.పి. రామస్వామి అయ్యరు అధ్యక్షత వహించారు. కార్యనిర్వాహకుల కోరిక మేరకు అయ్యరుగారు సభ కార్యక్రమాలలో పాల్గొనేందుకు ముందుగానే వెళ్ళారు.

ఆయన రాక తమిళ భాషాభిమానులకు దివ్యౌషధం వంటిది. పైగా ఆయన కీర్తి యిప్పుడు ఉచ్ఛ స్థితినందుకుంది. మధుర పౌరుల పక్షాన ఆయనకి నిధి బహూకరించారు. అప్పుడే కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శంకరాచార్యుల వారు ఆయనకి జోడు శాలువలు, కంకణం పంపించారు. దాక్షిణాత్య కళానిధి అనే బిరుదు కూడా ప్రసాదించారు. శంకర నమశ్శివాయర్ నన్నూలుకి వ్రాసిన వ్యాఖ్యానాన్ని పరిష్కరించి అయ్యరుగారు ప్రకటించడానికి ఆ నిధి బహుధ ఉపకరించింది. అందువల్ల ఆయన తన ఉపోద్ఘాతంలో విరాళాలిచ్చిన వారి యందరి పేర్లు ఉదాహరించారు

కొత్తగా స్థాపించబడిన కళాశాలాధ్యక్షులుగా వ్యవహరిస్తున్నా, అయ్యరుగారి పరిశోధన కార్యక్రమం నిరాటంకంగా సాగిపోయింది. చిదంబరంలో ఆయన ఉన్న ఆ రోజుల్లో దక్కయాగప్పరణిని సవ్యాఖ్యానంగా ప్రచురించడానికి కృషిచేశారు ఆ నిర్విరామ కార్యక్రమంవల్ల ఆయన ఆరోగ్యం దెబ్బతిన్నది అజీర్ణవ్యాధి ఒకవైపు. తరుచుగా కడుపు నొప్పితో ఆయన బాధపడేవారు. అందువల్ల తనను కళాశాలాధ్యక్ష పదవి నుంచి విముక్తుణ్ణి చెయ్యమని అణ్ణామలై చెట్టియారుని అర్థించగా, ఆయన అందుకు అంగీకరించాడు. అయ్యరుగారి సలహానుసరించి ఆయన సహవ్రతుడైన పొన్నోదువారుని ఆ పదవిలో నియమించారు.

ఇక నేను* నా జీవితంలోని ఒక ముఖ్య సంఘటనను మనవిచేస్తాను. భగవదను గ్రహంవల్ల నాకు అయ్యరుగారితో సంబంధం ఏర్పడింది. అప్పట్లో నేను సేంమదంగలం అనే గ్రామంలో కొందరికి తమిళం బోధిస్తూ వుండేవాణ్ణి నిజానంద సరస్వతి అనే సన్న్యాసి నేను తమిళంలో కవిత వ్రాయడం చూశాడు అయ్యరు గారి దగ్గర నేను తమిళం క్షుణ్ణంగా అభ్యసించడం మంచిదని ఆయన సలహా యిచ్చాడు. అలాగే సేందమంగలం మిరాసీదారయిన ఐరావత మొదలియారు కూడా పేర్కొన్నాడు, ఆయన నన్ను వడబారుకి తీసుకువెళ్లాడు. అప్పుడక్కడ తైపూసం ఉత్సవాలు జరుగుతున్నాయి. అక్కడినుంచి మేము చిదంబరం వెళ్లాము. అయ్యరు గారిని కలుసుకున్నాము.

ఆ రోజుల్లో నేను చొక్కా ధరించేవాణ్ణికాదు. నా మెడలో రుద్రాక్షమాల ఉండేది. నుదుట విభూతి రేఖలు. నా వేషం అయ్యరుగారికి నచ్చింది. ఆవర

---

* తమిళంలో ఈ పుస్తకం వ్రాసిన శ్రీ కి. వా. జగన్నాథన్

పూర్వంంగా నా వంక చూశారు, నాతోపాటు వచ్చిన నా శ్రేయోభిలాషులు నా తమిళ భాషాభిమానాన్ని అయ్యరుగారికి చెప్పారు. నా తమిళ జ్ఞానాన్ని ఇనుమడింప జేసుకోవాలన్న నా అభిలాషను కూడా తెలియజేశారు.

అప్పుడు అయ్యరుగారు తమ గురువుగారిని గురించి చెప్పడం మొదలు పెట్టారు. చదువు మధ్యలోనే మీనాక్షి సుందరంపిళ్లైగారిని వదిలి వెళ్ళిపోయిన వారిని గురించి చెప్పారు. "నేనిప్పుడు ఈ కళాశాలను విడిచిపెట్టి మదరాసు వెడుతున్నాను. కళాశాలలో నువ్వు చదవాలనుకుంటున్నావా? లేక నాతోపాటు మదరాసు వస్తావా?" అని అడిగారు. ఆయన పర్యవేక్షణలోనే నేను చదవదలచానని సమాధానం చెప్పాను.

తర్వాత ఆయన నన్ను ఒక పద్యం చెప్పమన్నారు. నేను కంబరామాయణం నుంచి ఒక పద్యం చదివాను. నా శక్తి ననుసరించి ఆయన అడిగిన ప్రశ్నలకు బదులుచెప్పాను. ఆయన తృప్తిచెంది వుండవచ్చు. నన్ను మదరాసుకి రమ్మన్నారు. తనవద్దనే చదువుకోవచ్చునన్నారు. అయితే భోజనానికి తగిన యేర్పాట్లు చేసుకోమని చెప్పారు. 1907 మార్చిలో ఆయన మదరాసువచ్చారు. చిదంబరం పౌరులు ప్రేమ పూర్వకమైన వీడ్కోలు చెప్పారు

మదరాసుకి రాగానే, ప్రాచీన తమిళ కావ్యాలను గురించి పది రోజులపాటు ఉపన్యసించవలసిందిగా కోరుతూ విశ్వ విద్యాలయం వారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది నవంబరు డిసెంబరులలో చెరి అయిదేసి రోజుల చొప్పున ఆయన విశ్వ విద్యాలయం సెనేటు హాలులో ఉపన్యసించారు. విశ్వ విద్యాలయం వారు ఆయనకి అయిదు వందల రూపాయల పారితోషికం ఇచ్చారు. అంతవరకు కిరసనాయిలు దీపం వెలుతురులో రాత్రిళ్ళు పొద్దుపోయేదాకా పనిచేస్తూ వుండిన అయ్యరుగారు, త్యాగరాజవిలాసంలో విద్యుద్దీపాలు వెలిగింపజేశారు. సరిగ్గా కార్తికదీపం రోజున ఆ యింట్లో విద్యుద్దీపాలు వెలిగాయి.

అయ్యరుగారి దగ్గర నేను చదువు మొదలుపెట్టినప్పుడు, ఆయన ఆరోగ్యం అంత తృప్తికరంగాలేదు. కనుక ఆయన కొంత కాలంపాటు పరిశోధన వ్యాసాంగాన్ని నిలిపివేశారు. ఆయన నాకు తిరువిళైయాడల్ పురాణం చెప్పసాగారు. రోజుకి 300 పద్యాలు చెప్పేవారు. పాఠం చెప్పేటప్పుడు ఎంతో ఓపిగ్గా పద్య గత మాధుర్యాన్ని, విశేషాలను, సాహిత్య పౌరాణికాంశాలను వివరించేవారు. తరుచుగా

మీనాక్షి సుందరంపిళ్ళైగారి సృజనాత్మక శక్తిని ఆయన బోధనా విధానాన్ని తెలియ జేసేవారు. ఆ వయస్సులో కూడా ఆయన పిళ్ళైగారి పట్ల ప్రదర్శించిన గౌరవం చూసి నేను ఆశ్చర్యపోయాను. పిళ్ళైగారికి సంగకాలపు తమిళ కృతులు గురించి యేమీ తెలియదనే చెప్పాలి సంగం కృతుల పరిష్కరణలు ప్రచురించి అయ్యరు గారు తమిళ సాహిత్య పునరుజ్జీవనానికి కారణభూతులయ్యారు. అయినా ఆయన పిళ్ళైగారి కంటె గొప్పవాడినని ఎన్నడూ అనుకోలేదు ఆయన గురుభక్తిని వేరే ఏ ఉపమానంతోను అభివర్ణించలేము.

ఆయన ప్రదర్శించిన గురుభక్తివల్లనూ ఆయనకి గల మతాభినివేశము వల్లనూ ఆనాటి శైవమఠాలతో ఆయనకి సన్నిహిత సంబంధం ఉండేది. మాయూర నాథుని కుంభాభిషేక మహోత్సవం సందర్భంగా తిరువాడుదురై మఠాధిపతులు ఆహ్వాన పత్రికను పద్యరూపంలో ప్రచురిద్దామనుకున్నారు. ఆయన అయ్యరుగారి సహాయాన్ని కోరాడు. మయూరనాథునికి సంబంధించిన మయిలై తిరిపన్తాదిని అయ్యరుగారు ప్రచురించారు. అది లఘుకృతి అయినా, దానికి ఆయన వ్రాసిన ఉపోద్ఘాతం అమూల్యమయింది.

తిరుప్పనందాళలో అప్పుడు కాశీవాసి చొక్కలింగతంబిరాన్ కాశీ మఠాధి పతులుగా ఉండేవారు. ఆయనకు సహాయకుడు స్వామినాథ తంబిరాన్. ఆయన విద్వాంసుడు; కొట్టైయూర్ శివకొళుందు దేశికర్ వంశీయుడు. ఆయన మదరాసులోని చెట్పట్టుకి వచ్చినప్పుడు, అయ్యరుగారు ఆయన్ని దర్శించారు. వారి సంభాషణ శివకొళుందుదేశికర్ కవితలు గురించి సాగింది. తంబిరాన్ కోరికమేరకు, ఆ కవితలను ప్రచురించడానికి అయ్యరుగారు సమ్మతించారు.

ఆయన సేకరణలో పేర్కొనదగినది తమిళ్ విడుతూదు అనే లఘుకృతి. తమిళ భాషాప్రశస్తిని అభివర్ణించే కృతి అది. శతాబ్దులుగా తమిళులు ఉపయోగించే దీపాల ప్రసక్తి ఆ కృతిలో వస్తుంది. మాయూరంలో కుంభాభిషేకానికి హాజరయి నప్పుడు, దేవాలయార్చకులనుంచి వివిధ దీపాలనుగురించి ఆయన ఎన్నో విషయాలు గ్రహించారు. తమిళ్ విడుతూందులోని యీ కింది రెండు పాదాలు ఆయన్ని ఆకట్టు కున్నాయి. ఆయన సాహిత్యాదర్శానికి ఆ పాదద్వయం మంత్రతుల్యం.

"నేను మనదలచితి నీ వల్ల, తమిళమా!

అంతేకాని అమృతమైన వలదు".

తిరుత్తణిగై పురాణం, కందపురాణం రచించిన కచ్చియప్పమునివర్ ప్రముఖ కవి. ఆయన శివజ్ఞానముని శిష్యుడు, ఆయనంటే మీనాక్షిసుందరంపిళ్లైకి మహాభిమానం. ఆ ముని సంతరించిన కచ్చి ఆనందరుద్రేశ వందు విడుతూదు అనే కృతిని అయ్యరుగారు చక్కగా పరిష్కరించారు. 1930 లో చాలాకాలంగా ఎదురుచూసిన తక్కయాగప్పరణిని ప్రచురించారు. అందులో ఆయన విద్వత్తు కనిపిస్తుంది. కావ్యవివరణ విషయంలో అది నేటికీ మిన్నగా కానవస్తున్నది.

1930 చివరలో అయ్యరుగారు ప్రమాదానికి లోనయ్యారు. మెట్లమీదనుంచి కిందికి దిగుతుంటే కాలుజారి పడ్డారు. అందువల్ల పాదానికి దెబ్బ తగిలింది. పొరుగున వున్న వైద్యుడు చికిత్స చేశాడు. కాని లాభంలేకపోయింది అప్పుడు సుప్రసిద్ధ శస్త్రవైద్యుడు డాక్టర్ రంగాచారిని పిలిపించారు. ఆయన అయ్యరుగారికి ఇంట్లోనే శస్త్రచికిత్స చేశాడు. కొన్నాళ్ళపాటు ఆయన మంచంలోనే ఉండవలసి వచ్చింది. ఎక్కువగా చదవవద్దనీ వ్రాయవద్దనీ వైద్యుడు సలహా ఇచ్చాడు. తమిళ కవితయే ప్రాణప్రాణమైన అయ్యరుగారికి ఇది ఒక పరీక్ష. నేనప్పుడు ఆయన దగ్గరే వున్నాను. ఆయన కుమారుడు హైకోర్టులో ఉద్యోగం చేసేవాడు. ఆయన కోర్టుకి వెళ్ళగానే, అయ్యరుగారు తమిళ కావ్యం చదవమని నన్నడిగారు. కాని ఆయన మనస్సు నిలకడగా లేదు. మీనాక్షిసుందరం పిళ్లైగారి జీవితం గురించి ఆయన చాలా విషయాలు సేకరించారు. గురువుగారి జీవితచరిత్ర వ్రాయాలని ఆయన అభిలాష. అప్పటికి కొన్ని భాగాలు వ్రాశారు. ఆ జీవిత చరిత్రను పూర్తి చెయ్యకుండానే తాను మరణిస్తానేమో నన్న భయం ఆయన్ని వెంటాడింది.

"ఆ కట్టను తీసుకురా" అని అయ్యరుగారు నన్నాజ్ఞాపించారు. డాక్టరుగారి సలహాని గుర్తుచేశాను "డాక్టరుగారికేంతెలుసు? నేను నా పనిని కనక చేస్తే, భగవంతుడు నన్ను రక్షిస్తాడు" అన్నారు అయ్యరుగారు. నేనప్పుడు ఆ కట్టను తీసుకువచ్చి, విప్పాను. పిళ్లైగారి చివరిరోజులు గురించి ఆయన డిక్టేట్ చెయ్యసాగారు. ఆయన చెపుతుంటే కళ్ళలోంచి నీళ్ళు కారేవి. అశ్రుపూరిత నయనాలతో నేను వ్రాశాను. మీనాక్షి సుందరంపిళ్లై జీవితచరిత్ర పూర్తి అయింది; రెండు భాగాలుగా ప్రచురించబడింది.

1932 ఆగస్టులో జరిగిన స్నాతకోత్సవంలో మదరాసు విశ్వవిద్యాలయంవారు అయ్యరుగారికి గౌరవ డాక్టరేటు ఇచ్చారు. డిగ్రీ తీసుకునేటప్పుడు అందుకు అర్హ్రి

మైన గౌను ధరించాలి. ఆ స్నాతకోత్సవంలోనే గౌరవపట్టం స్వీకరించవలసిన పి. యస్. శివస్వామి అయ్యరు అయ్యగారికోసం ఆ ఉడుపులు కుట్టించారు. ఆ విశిష్ట గౌరవాన్ని స్వీకరిస్తూ, ఆయన ముక్తసరిగా ప్రసంగించారు.

"మహా ఘనత వహించిన మదరాసు విశ్వవిద్యాలయాధ్యక్షుల సముఖానికి విజ్ఞాపనం. సకల కళలకు నిలయమైన యీ కేంద్రంలో వివిధ శాఖలలో నిష్ణాతులైన వారి సమక్షంలో ఈ గౌరవ పట్టం తమ కరకమలముల నుంచి తీసుకోవడం పరమ భాగ్యంగా భావిస్తున్నాను. నన్ను ప్రశంసిస్తూ ప్రసంగించిన తమకూ, ఇందుకు కారణభూతులైన ప్రముఖులకూ నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు. ఈ పట్టం పొందే అర్హత నాకు లేకపోయినా, ఈ గౌరవం తమిళభాషకు జరిగినట్లుగా నా అంతరంగిక అభిప్రాయం".

సెందమిళులో అయ్యరుగారు ధారావాహికంగా ప్రచురిస్తున్న పెక్కు లఘు కృతుల్ని చదివిన శివనేశన్ పత్రికాసంపాదకుడు తన పత్రికకు కూడా వ్యాసాలు వ్రాయమని ఆయన్ని కోరాడు. ఆయన అందుకు అంగీకరించాడు. ఆ పత్రికలో పళమలై క్కోవై, తిరుమయిలై యమక అన్తాది మొదలైనవి ప్రచురించబడ్డాయి.

మెడ్రాస్ లా జర్నల్ అధిపతి అయిన నారాయణస్వామి అయ్యరు స్థాపించిన కలైమగళ్ అనే పత్రిక కూడా అయ్యరుగారి రచనల్ని ప్రకటించింది. పత్రిక ప్రారంభించే ముందు ఆయన అయ్యరుగారిని ప్రారంభ సంచికకు ఒక వ్యాసం వ్రాసి యిమ్మని అర్థించాడు. వెంటనే ఆయన కలైమగళ్ అనే వ్యాసం వ్రాసియిచ్చారు. కలైగళ్ (కళలు) పేరుతో కలైమగళ్ (సరస్వతి) పేరు ధ్వనించేలా ఆ పేరు పెట్టారు ప్రాచీన తమిళులు సంగీత, నాటకాలకు అధిక ప్రాధాన్యమిచ్చేవారని ఆయన అందులో పేర్కొన్నారు. మణిమేకలై, పెరుంగదైలను ఆధారంగా చేసుకుని ఆ రోజుల్లో శిల్ప చిత్ర లేఖనాలు ఉచ్ఛస్థితిలో ఉండేవని పేర్కొన్నారు. నేతపని, పూలు గుచ్చడం, పాకం, జ్యోతిషం, ఖగోళశాస్త్రం, వైద్యశాస్త్రం, శిల్పం, నౌకాశాస్త్రం, యుద్ధం—ఇలా ప్రాచీన తమిళుల జీవన విధానం ప్రతి స్థాయిలోనూ కళతో ముడిపడింది. "కట్టురై వగై"ని ఆధారం చేసుకుని వక్తృత్వ కళ రూపొందించబడింది. గజములకూ అశ్వములకూ శిక్షణ ఇచ్చే విషయమై రచనలు చేయబడ్డాయి. గత వైభవం గురించి చెప్పడంలోనే ఆయన తృప్తిపడలేదు. ఆధునిక ప్రపంచంలో విస్తృతి చెందుతున్న విజ్ఞానం గురించి ఆసక్తి ప్రదర్శించారు. కొత్తగా కనిపెట్టబడిన

వాటినుంచి మాతృదేశం అభ్యున్నతి చెందాలని ఆయన ఆశించారు. విదేశ భాషల నుంచి అనర్ఘ రత్నాలను అనువదించాలని ఆయన విజ్ఞప్తి చేశారు. సంస్కృతం నుంచి ప్రాచీన తమిళులు సాహిత్య, శాస్త్రీయ గ్రంథాలు అనువదించి త్రోవ చూపారని పేర్కొన్నారు.

కలైమగళ్ ప్రతి సంచికలోనూ అయ్యరుగారి ప్రముఖ రచనలు ఉండేవి. ఆయన కవులు వాగ్గేయకారులు మొదలైన వాటిని గురించి ధారావాహికంగా రచనలు చేసి ఆ పత్రికలో ప్రచురించారు. ఆ తర్వాత అవి పత్రికాను బంధాలుగా వెలువడ్డాయి. కాగా ఆయన ఎనభయ్యవ జన్మదినం సందర్భంగా వెలువడిన కలైమగళ్ ప్రత్యేక సంచికలో వ్రాయబడిన సంపాదకీయంలో ఆయన్ని "కలైమగళ్ పెంపుడుతల్లి"గా అభివర్ణించడం సహేతుకమే. ధనవణికన్ అనే ఒక పత్రిక ఇలా వ్రాసింది.

"మహా విద్వాంసుడైన స్వామినాథ అయ్యరు ఇంతవరకు అజ్ఞాతంగా వున్న మహాపురుషులను గురించి సరళమైన తమిళంలో జీవిత చరిత్రలు వ్రాస్తున్నారు. సాంప్రదాయక విద్వాంసులు కనక ప్రయత్నిస్తే, వాళ్ళు తప్పక సరళంగా శక్తిమంతంగా వ్రాయగలరని ఆయన నిరూపించారు. అయ్యరుగారి శైలి విలక్షణమయ్యింది. తగినవీ చిన్న చిన్నవీ అయిన మాటలు, సరళమూ శక్తివంతమూ అయిన శైలి; సరళ సుందరములైన వర్ణనలు; హాస్యయుక్తమూ భావప్రధానమూ అయిన వర్ణనాంశం; ఆ మహా విద్వాంసుని శైలిలో గోచరించే కొన్ని ప్రధాన లక్షణాలు. ప్రతిభా సముజ్వలమైన ఆయన రచనతో కలైమగళ్ ప్రతి సంచిక ప్రారంభమవుతున్నది".

మీనాక్షిసుందరంపిళ్ళైగారి జీవితచరిత్ర రెండు భాగాలు వెలుగు చూసినప్పుడు అయ్యరుగారు పరమానందభరితులయ్యారు. "మహావిద్వాన్ మీనాక్షిసుందరంపిళ్ళై అవర్‌గళ్ చరిత్తిరం" ఒక వచన కావ్యం; మార్గదర్శకమైన రచన; అన్ని కాలాలకు పనికివచ్చే ఉత్తమ రచన.

# 12

# అయ్యరు గారికి అశీతి వర్షాలు

అయ్యరుగారు తమ షష్ట్యబ్ది పూర్త్యుత్సవాన్ని సముచిత రీతిని జరిపే అవకాశం కలిగించనందుకు ఆయన అభిమానులకు కొంచెం కొరతగా ఉంది. కనుక ఆయన 80 వ జన్మదినోత్సవాన్ని వైభవోపేతంగా జరపదలచిన అభిమానులు సర్ పి. టి. రాజన్ అధ్యక్షతన సన్మానసంఘం ఏర్పాటుచేశారు. విశ్వవిద్యాలయ సెనేటు హాలులో సర్ మహమ్మద్ ఉస్మాన్ అధ్యక్షతన ఒక బహిరంగ సభ జరిగింది. ప్రాచీన తమిళకావ్యాలను వెలికి తీసి ప్రచురించేందుకు అయ్యరుగారు చేసిన కృషివల్ల తమిళనాడు చరిత్రను పునఃవ్రాయవలసివచ్చిందని సన్మానపత్రంలో పేర్కొనబడింది. 3,001 రూపాయల పర్సు బహూకరించబడింది. మదరాసులోని ప్రముఖ సాహిత్య సంస్థలు తమిళతాతకు ప్రశంసాపత్రాలు సమర్పించాయి. ఆ ప్రశంస, బహూకృతులు అన్నీ తమిళ తల్లి అనుగ్రహ విశేషమని అయ్యరు గారు సవినయంగా తమ ప్రత్యుత్తరంలో పేర్కొన్నారు.

"నా మనస్సు ఆనందజలధిలో ఓలలాడుతున్నది. భగవద్దర్శనం గురించి సేక్కిళారు చేసిన వర్ణన ప్రస్తుతం స్ఫురణకు వస్తున్నది. దానిని అభివర్ణించడానికి తగిన మాటలు లభ్యంకావడంలేదు. ఆ దర్శనం నన్ను కాపాడుగాక? మళ్ళీ నాకు యౌవనం వచ్చినట్లయింది. భవిష్యత్తులోని నా తమిళ పరిశోధనోద్యమానికి తమిళ ప్రజలు ప్రదర్శించిన యీ ఆదరాభిమానముల వల్ల తగినశక్తి వచ్చినట్లనిపించింది"

అయ్యరుగారి చిత్రపటాన్ని సర్ మహమ్మద్ ఉస్మాన్ ఆవిష్కరించారు. విశ్వవిద్యాలయ పక్షాన ఉపాధ్యక్షులు లిటిల్ హెయిల్స్ పటాన్ని స్వీకరించారు. స్వామినాథ అయ్యరు ఎనభయ్యవ జన్మదినోత్సవ కలైమగళ్ ప్రత్యేక సంచిక ఆవిష్కరించబడింది. హరికేశవ కల్లూర్ ముత్తయ్య భాగవతర్ పాడిన తమిళ కృతులతో సభ ముగిసింది. ఆయన జన్మదినోత్సవం తమిళనాడులోని ప్రధాన పట్టణాలలోనే కాక దూరాన వున్న రంగూను, జాఫ్నాలలో కూడా జరిగింది.

వృద్ధాప్యం వల్ల అయ్యరుగారి పరిశోధన, పత్రికారచనా వ్యాసంగాలకు అంతరాయం కలగలేదు. ఆయన తమిళశైలి, కథననైపుణి పండితుల్నీ పామరుల్నీ ఆకట్టుకున్నాయి. ఒకసారి కలైమగళ్‌లో, ఆయన బిచ్చగానిపాట అనే వ్యాసం ప్రచురించారు. అది చదివి, 1937, మే 22 న రాజాజీ ఆయనకి ఒక ఉత్తరం వ్రాశారు.

"నమస్కారం, కలైమగళ్ సంచికలు కొన్నిటిని నేను చదవలేకపోతున్నాను. నా సమస్యలతో సతమతమవుతూ కూడా, అదృష్టవశాన నేను కొన్ని సంచికలు చదివాను. మీ "బిచ్చగాని పాట" వ్యాసాన్ని చదివిన సంతోషంతో మీకీ ఉత్తరం వ్రాస్తున్నాను. దానికి మీరు "ఊరిని తగలబెడుతుందా?" అనే శీర్షిక వుంచివుండవచ్చు. ఇలాంటి ఒక రత్నాన్ని నేను కనక వ్రాసివుంటే, నేనలా పేరుపెట్టి వుండేవాణ్ణి. ఎంతచక్కని కథ! ఏమి రసం!" —— రాజగోపాలాచారి

భారతీయ సాహిత్య పరిషత్ సమావేశం 1937 లో మదరాసులో జరిగింది. దానికి గాంధీమహాత్ముడు అధ్యక్షత వహించారు. అతిథేయ సంఘానికి ఎవరిని అధ్యక్షులుగా ఉంచితే సముచితంగా ఉంటుందా అని సభా నిర్వాహకులు మథన పడ్డారు. చివరికి వాళ్ళు అయ్యరుగారిని అభ్యర్థించారు ఆయన స్వాగతోపన్యాసం చేశారు. సంగవాఙ్మయం వల్ల తెలియవచ్చిన తమిళుల ప్రాభవం, తమిళుల సంస్కృతి మొదలైన వాటిని ఆయన తమ ఉపన్యాసంలో తెలియజేశారు. ఆ విషయాదికంలో ముక్కాలు మువ్వీసం గాంధీజీకి కొత్తగా వినిపించింది. సంతుష్టుడైన గాంధీజీ, "రూపుకట్టిన తమిళంగా ద్యోతిస్తున్న అయ్యరుగారికి విద్యార్థిగా ఉండాలని నేను అభిలషిస్తున్నాను. ఆ అవకాశం నాకు ఎప్పుడు కలుగుతుందో!" అని పేర్కొన్నారు, తమ ప్రసంగంలో.

ఆనాటి కానాడు వయస్సు పైబడుతున్నా, అయ్యరుగారు ఆ వయస్సుని లెక్కచెయ్యకుండ సంగకాలపు కృతి అయిన కురుంతొగైని పరిశోధింప పూనుకున్నారు. అంతకుక్రితమే ఒకరు ఆ కృతిని ప్రచురించారు. అది తప్పుల తడక. ఆ సంకలన కృతిలోవి పద్యాలకు అయ్యరుగారు విపులమైన వ్యాఖ్యవ్రాశారు, చాలా జాగ్రత్తగా తమ పరిష్కరణను తయారుచేశారు. తమ పరిశోధనాంశాలకు వందల పుటలు వినియోగించారు. ప్రతి పదార్థం, తాత్పర్యం, ప్రత్యేక వివరణ సంవాద రచనలు, ఉదాహరణలు, పాఠాంతరాలు, విపులమైన పదపట్టిక మొదలైనవి

ఆ ప్రచురణకు విశిష్టత సమకూర్చాయి. 1937 లో ఆ సంశోధిత ప్రచురణ వెలుగు చూడగా, ఆయన సంతృప్తి చెందారు.

కురుంతొగై వెలువడిన పిమ్మట, తిరుప్పనందాళ్ మఠాధిపతులైన స్వామినాథ తంబిరాన్ కోరిక మేరకు అయ్యరుగారు కుమరగురుపరర్ ప్రబంధాల పరిష్కరణ వెలువడింది. ఆయనంటే మఠాధిపతులకు అపరిమితమైన ఆదరభావం. 1939 లో ఆ సంపుటం ముద్రితమైన తర్వాత, ఆయన తిరుప్పనందాళ్ వెళ్ళారు. చాలామంది పండితులు, అధ్యాపకులు, కవులు ఆయన దర్శనార్థం వచ్చేవారు. ఆ విధంగా అక్కడ చాలా రోజులు గడిచాయి.

ఒకనాడు ఉదయం ఏడున్నరకు, అయ్యరుగారు పడకకుర్చీలో పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నారు. కొందరు విద్యార్థులు ఆయన దగ్గర కూర్చున్నారు. ఇంతలో దొడ్డితలుపు తెరిచిన చప్పుడయింది. లోపలికి వస్తున్నది ఎవరో స్పష్టంగా తెలియలేదు. మఠాధిపతి మెల్లగా లోపలికి వస్తున్నట్లు గ్రహించారు.

"ఎవరు వచ్చేది ?" అడిగారు అయ్యరుగారు. "స్వామిగళ్" అని ప్రత్యుత్తరం ఇచ్చారు. "అలాగా!" అంటూ అయ్యరుగారు గబగబ పైకి లేచారు. "మీరిలా రావాలా ? మీరు కబురు పంపితే, నేనే వచ్చేవాణ్నిగదా ! తమరు దొడ్లోంచి యిలా రావాలా ?" అన్నారు అయ్యరుగారు.

"మీరు చేసిన వుపకారానికి యిది యే మాత్రం ? శివజ్ఞానందుశేఖర్, కుమర గురుపరర్‌ల రచనలు ప్రచురించి మా కుటుంబానికి ఎంతో గౌరవం కల్పించారు. మా మఠానికి గౌరవం కల్పించారు. అందుకు ప్రత్యుపకారం నేనేం చేయగలను ?"

అని చెపుతూ ఆ మఠాధిపతి వెయ్యిరూపాయల వెండిపళ్లెం ఒకటి అయ్యరు గారికి ఇచ్చారు. ఆయన ఆశ్చర్యానికి అంతులేదు. ఆ ఉదంతాన్ని సంతోషంగా ఆయన నలుగురికీ చెప్పుకునేవారు,

ఎనభయ్యవ జన్మదినోత్సవం సందర్భంగా అయ్యరుగారిని స్వీయచరిత్ర వ్రాయవలసిందిగా చాలామంది కోరారు. స్వీయచరిత్ర ప్రచురణకుగాను ఒక అభిమాని 501 రూపాయలు ఆయనకి పంపించారు. ఆ స్వీయచరిత్ర తమిళ సాహిత్య, సాంఘిక చరిత్రగా ఉపయోగపడగలదని ఆ అభిమాని భావించారు. అయ్యరుగారు తమ స్వీయచరిత్రను తమ పత్రికలో ధారావాహికంగా ప్రచురించ

మని ఆనందవికటన్ పత్రికా సంపాదకులు కల్కి- కృష్ణమూర్తి కోరాడు. ఎన్ చరిత్తిరం (నా చరిత్ర) వ్రాయడానికి అయ్యరుగారు సమ్మతించారు. దానితోపాటు ప్రచురించేందుకుగాను ఆలయాల, కట్టడాల ఛాయాచిత్రాలు లభించాయి. ఎన్ చరిత్తిరం 1940, జనవరి నుంచి వెలువడసాగింది; తమిళులలో నూతన చైతన్యం కలగసాగింది. వారం వారం తమిళులు గతంలో విహరించసాగారు; తమ సాంస్కృతిక వారసత్వాన్ని గురించి చాలా విషయాలు తెలుసుకోగలిగారు. కాని అయ్యరు గారు 1942, ఏప్రిలులో కాలధర్మం చెందడం వల్ల, ఎన్ చరిత్తిరం అసమగ్రంగా ఉండిపోయింది.

1942 జనవరి 12. అది సోమవారం. మేడమీది గదిలో ఆయన ఒక బల్ల మీద పడుకుని ఉషః కాలాన లేచారు. కిందికి దిగి వస్తుండగా పడ్డారు. మోకాలు మీద దెబ్బ తగిలింది. నెత్తురు కారడం మొదలుపెట్టింది. వెంటనే వైద్యపరీక్ష జరిగింది. ఎముక విరిగిపోయినట్లు చెప్పారు.

రెండవ ప్రపంచయుద్ధం జరుగుతున్న కాలమది. మదరాసు వాస్తవ్యులు తమ కుటుంబాలను సురక్షిత ప్రదేశాలకు—అనగా, తమిళనాడులోపలి ప్రాంతాలకు— పంపించసాగారు. తిరుక్క-ళుక్కు-న్రంలో తిరువాడుదురై మఠానికి చెందిన ఒక భవనంలో అయ్యరుగారిని నివసింపజేశారు. ఆయన ఏప్రిలు 11 న త్యాగరాజ విలాసం నుంచి కారులో బయలుదేరారు. బయలుదేరేటప్పుడు ఆయన ఏమను కున్నారో యేమిటో !

"దేవా ! తిరుక్క-ళుక్కు-న్రంలో నీవు ఎన్నో అద్భుతలీలలు ప్రదర్శించావు" అనే తిరువాచకం గీతాన్ని ఆయన చదివారు. మళ్ళీ యీ యింటికి తిరిగివస్తానా? అంటూ బయలుదేరారు. కారు కొత్తనివాసానికి సాయంకాలం చేరుకుంది పుస్తకాలను తాళ దళ ప్రతుల్ని ఇంటివద్దనే విడిచివచ్చినందుకు ఆయన విచారించారు. శిశువునుంచి విడివడిన తల్లి వలె ఆయన బాధపడ్డారు తండ్రి బాధను కొడుకు అర్థం చేసుకున్నాడు. కొద్దిరోజుల్లోనే వాటన్నిటిని పది బళ్ళమీద కొత్త నివాసానికి చేర్చాడు.

తిరుక్క-ళుక్కు-న్రం వచ్చినతర్వాత, అయ్యరుగారి ఆరోగ్యంలో మార్పు కనిపించింది. లేచి కూర్చోగలిగారు అప్పుడు నా కుటుంబం మైసూర్‌లో ఉండేది మా నాయనగారి ఆరోగ్యం సరిగాలేదని నాకొక జాబు వచ్చింది. మైసూరుకి వెళ్ళే

ముందు, నేను తిరుక్కళుక్కున్ఱం వెళ్ళి అక్కడ నా గురుదేవునితో ఒకరోజు గడిపాను, రోజంతా తమిళసాహిత్యం గురించి మాట్లాడారు. కంబరామాయణం, తేవారం— ఈ రెంటినీ సక్రమంగా ప్రచురించాలని ఆయన అభిలషించారు. "వాటిని పరిష్కరించడంలో నాకు నువ్వు సహాయం చేస్తావా? ఏదీ నీ చెయ్యి యిలా ఇవ్వు" అన్నారు. ఆ కరకమలాలను స్పృశించే అవకాశం అదే ఆఖరిదని అప్పుడు నేను గ్రహించలేదు. ఆ చేతుల్ని కళ్ళకద్దుకున్నాను. ఆయనవద్ద అనుజ్ఞ తీసుకుని, నేను మైసూర్‌కి పయనమయ్యాను.

అప్పుడు అయ్యరుగారికి జ్వరం. ఆయన కుమారుడు మదరాసులో ఉన్నాడు. ఆయనకి తంతి పంపారు. తనయుడు వచ్చేలోపుగా, అయ్యరుగారు దైవికంచెందారు. ఆయన ఆఖరుగడియలలో ఆయన కుమారుడుగాని నేనుగాని అయనవద్ద లేకపొయ్యాముని బాధపడ్డాము. తమిళం ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. తిరుక్కళుక్కున్ఱంలో ఆయన దైవసన్నిధిని చేరుకున్నారు.

అయ్యరుగారి మరణంతో తమిళభాషా సాహిత్యాలకు భర్తీ చెయ్యజాలని లోటూ వాటిల్లింది. కృతజ్ఞతగల తమిళులు ఆయన్ని తమిళ తాతగా సంస్మరిస్తున్నారు, ఆయన పేరుమీదుగా కీర్తిశేషురాలు శ్రీమతి రుక్మిణీదేవి అరుండేల్ తిరువాన్మయూరులో ఒక గ్రంథాలయం స్థాపించారు. అయ్యరుగారు సంపాదించిన గ్రంథాలు, తాళపత్రప్రతులు ఆ గ్రంథాలయంలో భద్రపరిచబడి వున్నాయి. తమిళ భాషా సాహిత్యాలలో తమ పరిశోధనను విస్తృతం చేసుకునే ఉద్దేశంతో తమిళ విద్వాంసులు చాలామంది ప్రతినిత్యం ఆ గ్రంథాలను తాళపత్రప్రతుల్నీ సంప్రదిస్తున్నారు

# 13

# బహుముఖ ప్రతిభ

ప్రాశ్చాత్య విమర్శ పద్ధతుల్ని అయ్యరుగారు అధ్యయనం చెయ్యకపోయినా, పుస్తక ప్రచురణలోని సరిక్రొత్త పద్ధతుల్ని ఆయన గ్రహించివుండడం గమనించ

దగిన అంశం. అయ్యరుగారి సంశోధిత గ్రంథాలలో విపులమైన పీఠికలు ఉంటాయి. ఆయా కృతులకు సంబంధించిన అంశాలు, ప్రధాన లక్షణాలు, వ్రాతప్రతులు ఎలా లభ్యమైనవో ఆ విషయాదికం, సహాయ చేసినవారి వివరాలు మొదలైనవి ఆ పీఠికల లోని ముఖ్యాంశాలు. వ్రాతప్రతిని సంపాదించడంలో సహాయపడిన వాళ్ళ పేర్లుకూడా ఆయన తెలియజేసేవారు. ఆయన గుణగణాలలో ముఖ్యంగా పేర్కొనదగింది. ఆయనకి గల కృతజ్ఞతాగుణం. చివరికి విద్యార్థులు చేసిన సహాయాన్ని కూడా ఆయన స్మరించేవారు. వాళ్ళని నిర్లక్ష్యం చేసేవారుకాదు.

ఆయన ఏఏ ప్రదేశాలనుంచి వ్రాతప్రతులు సంపాదించారో ఆ జాబితాను బట్టి ఆయన విస్తృత పర్యటనలు ఆయన పడ్డ యిబ్బందులు మొదలైనవాటిని గ్రహించవచ్చు. కొన్ని సందర్భాలలో ఆయన పర్యటనలు నిరుపయోగములయేవి. కాని కొత్తగా ఒక వ్రాతప్రతిని చూడగా ఆయన పొందిన విస్మయమూ, సంతోషమూ అలవికానివి. ఒక ఉదాహరణం. ఎలా తాను పట్టుప్పాత్తు సంకల నాన్ని కనుగొన్నదీ ఆయనే వెన్నెలలో మల్లెలు" అనే రచనలో వ్యక్తంచేశారు. చాలా కష్టపడ్డతర్వాత, ఆళ్వార్ తిరునగరికి చెందిన లక్ష్మణకవిరాయర్ వద్ద వున్న ఆయన మామగారి వ్రాతప్రతుల్ని అయ్యరుగారు చూడగలిగారు. ఒక యింటి అరుగుమీద కూర్చొని ఆయన స్థానిక విద్వాంసులు దివ్య ప్రబంధానికి చెపుతున్న వ్యాఖ్యానాన్ని వినసాగారు. అప్పుడు నమ్మాళ్వారు విగ్రహం ఊరేగింపుగా తీసుకు వెడుతున్నారు ఆ వెన్నెలలో ఆయన భక్తకవి అయిన నమ్మాళ్వారుని విజయం ప్రసాదించమని ప్రార్థించారు. సరిగ్గా ఆ సమయానికి లక్ష్మణ కవిరాయర్ తాళ దళప్రతి ఒకటి తీసుకువచ్చాడు. ఆ వ్రాతప్రతి కట్టను విప్పగా అయ్యరుగారికి ముల్లైప్పాట్టు (మల్లెపాట) అనే అక్షరాలు కనిపించాయి "వెన్నెట్లో మల్లెలు వికసించగానే నా హృదయం సంతోషంతో విరిసింది" అన్నారు అయ్యరుగారు. ఆ తర్వాత ఆయన సంగం కృతులలో ప్రధానమైన పత్తుప్పాట్టుని ప్రచురించ గలిగారు సంగం యుగపు చారిత్రక విషయాలను గ్రహించేందుకు అది బహుధా ఉపకరించింది.

మనకుగల జీవితచరిత్ర రచయితలలో అయ్యరుగారు ప్రముఖులు. వైయక్తి కంగా గాని ఔద్యోగికంగా గాని తాను కలుసుకున్న ప్రముఖుల్ని ఆయన ఎన్నడూ విస్మరించలేదు. వారి జీవితాలను ఆయన సంగ్రహంగానో విపులంగానో తెలియ

జేశారు. ఆయన సంతరించిన జీవితచరిత్రలలో మొదటిది మీనాక్షి సుందరం పిళ్లై గారి జీవిత చరిత్ర. గురువుగారిని ఆయన పేరు పెట్టి పేర్కొనలేదు. ఆయన గురుభక్తి అలాంటిది! "ఈ మహాకవి", ఈ మహాపండితుడు!" "ఈ తమిళ పండితుడు" అని ఆయన వ్యవహరించారు. కాని ఒక్కసారి మాత్రం, అనగా పిళ్లైగారి బాల్యం గురించి ప్రస్తావిస్తూ "మీనాక్షి సుందరం[1] " అని పేర్కొన్నారు." అయిష్టంగానే తానిలా పేర్కొన్నానని ఆయన అథోజ్ఞాపికలో సూచించారు.

రెండు భాగాలలో వ్రాయబడిన యీ గ్రంథంలో, పిళ్లైగారి జీవితచరిత్రను ప్రారంభించేందుకు ముందు మహావిద్వాన్‌గారి విద్వత్కుటుంబం గురించి చెప్ప బడింది. తర్వాత పిళ్లైగారి బాల్యం. పేదరికానికి యిష్టపడి అనంతమైన తమిళ సాహిత్య సౌభాగ్యాన్ని పొందాలనుకుని గడిపిన యౌవనం వర్ణించబడ్డాయి. కవిగా అధ్యాపకుడుగా ఆయన జీవిత చిత్రణ ఎంతో జాగ్రత్తగా చేయబడింది. అవసర మైనప్పుడు ఆయన రచనలు ఉదహరించబడ్డాయి; కొన్నిచోట్ల కొన్ని భాగాలు ఉద్ధృతములయినాయి ఆయనలోని వినయం, దయ, గొప్పతనం మొదలైన వాటిని వివరించేందుకు ఆయన జీవితోదంతాలను జాగరూకతతో పేర్కొనడం జరిగింది. అయ్యరుగారు అభివర్ణించిన పిళ్లైగారి చరమదశ హృదయాన్ని కదిలిస్తుంది. ఇక ఆయన వ్యక్తిత్వం గురించి వ్రాయబడిన అధ్యాయంలో ఆయన ప్రదర్శించిన సంతృప్తి, సహనం, శిష్యవాత్సల్యం మొదలైనవి పరమ రమణీయంగా చిత్రించ బడినాయి. అలాగే ఆయనకి గల తమిళభాషాభిమానం, శివభక్తి చక్కగా చిత్రించ బడినాయి అయ్యరుగారు గురువుగారి వాత్సల్యాన్ని ఎంతగానో పొందినవారు కనుక, ఆయన శిష్యవాత్సల్యం ప్రత్యేకంగా పేర్కొనబడింది ఆయన జంగమ గ్రంథాలయం. అందువల్ల ఆయన అంతేవాసులు తక్కువ కాలంలో బంగారు పంటలు పండించుకోగలిగారు.

"పిళ్లైగారి తమిళ భాషాభిమానం నిరుపమానం. పుస్తక పఠనావసరంలో ఆయన ఆహారనిద్రలు విస్మరించేవారు. ఆయన అనారోగ్యానికి తమిళ కావ్యం దివ్యౌషధంగా పనిచేసేది. కావ్యగీత సౌందర్యాన్ని వివరించేటప్పుడు ఆయన పారవశ్యం చెందేవారు.

---

1. తమిళమూలంలో, శ్రీ కి. వా. జగన్నాథన్‌గారు కూడా తన గురువుగారయిన డాక్టర్ స్వామినాథ అయ్యరుగారిని "నా గురుదేవులు" అని పేర్కొన్నారు.

పిళ్లైగారు త్వరితగతిని కవిత్వం చెప్పడం అయ్యరుగారికి ఎప్పుడూ విస్మయావహంగా ఉండేది.

అయ్యరుగారు వ్రాసిన సంగ్రహ జీవితచరిత్రలలో త్యాగరాజ చెట్టిగారి జీవిత చరిత్ర పేర్కొనదగింది కుంభకోణం కళాశాలకు తన వారసునిగా ఆయన్ని తెచ్చింది చెట్టిగారే. చెట్టిగారిపట్ల ఆయనకి అంతులేని అభిమానం. ఇతరులు ఆయన గుణగణాలలో దోషాలుగా భావించే వాటినికూడా పేర్కొన్నారు. ఒక ఉదాహరణ, ఎదుటి వ్యక్తి మీనాక్షి సుందరంపిళ్లైగారయినా సరే, చెట్టియారు చాలా ధైర్యంగా తన మనోగతాభిప్రాయాలు వ్యక్తం చేసేవారు. ఆయన శీలం నిష్కళంకమైనది. ఆయన పాండిత్యం బహు విస్తృతమూ, అగాధమూ అయినది. ఆయనకి అయ్యరుగారంటే చాలా అభిమానం. జీవక చింతామణిని అయ్యరుగారు ప్రచురించ దలచినప్పుడు, చెట్టియారు విరాళాలు సేకరించడానికి ముందుకు వచ్చారు. పుస్తక ముద్రణ పూర్తి అయింది అయ్యరుగారు ఒక ప్రతి తీసుకుని ఆయన యింటికి వెళ్ళారు. రాత్రి బాగా పొద్దు పోయింది అయ్యరుగారి గొంతు విని చెట్టియారు బయటికి వచ్చి, "మిమ్మల్ని గురించి ఆలోచిస్తూ పడుకున్నాను" అని అంటూ ఆయన్ని ప్రీతి పురస్సరంగా కౌగిలించుకున్నారు. అయ్యరుగారు విస్మయం చెందారు. అప్పుడు ఒక మిత్రుడు తన వద్దకు అంతకు ముందే ఒక ప్రతి తీసుకువచ్చాడనీ, ఉపోద్ఘాతం, కవి జీవితం, కావ్య కథా సంగ్రహం వివిధ పద పట్టికలు మొదలైనవి తనకు అతనే చదివి వినిపించాడనీ ఆయన చెప్పారు. అప్పటికే చెట్టియారు అంధులయ్యారు. ఆయనకి పట్టరాని సంతోషం కలిగింది కాని ఆ విజయం చూడడానికి పిళ్లైగారు లేరన్న విచారం ఆయన్ని బాధించింది. ఆయన ప్రశంసావాక్యాలకు తుదిలేదు. "ఎంత కష్టమైన పని, అంత జటిలమైన కావ్యంలోని ప్రతి పాదాన్ని అర్థం చేసుకోవడం అనుకున్నంత సులభం కాదు పైగా సంశయాలకు ఎడమీయకుండా పరిష్కరించడం మరింత కష్టం. అంత పెద్ద పుస్తకం! మీరు తమిళులకు ఒక అపూర్వ నిధిని ప్రసాదించారు." అని ఆయన అన్నారు.

ఈ ప్రశంసా వాక్యాలను అయ్యరుగారు జీర్ణించుకునే లోపల, చెట్టియారు తమ సహజమైన నిష్కాపట్య ధోరణిలో ఇలా అన్నారు. "కాని నా అసంతృప్తిని కూడా చెపుతున్నాను. మీరు తిరువావడుదురై మఠాధిపతుల్ని గురించి, పిళ్లైగారిని గురించీ వ్రాశారు. కాని నన్ను గురించి మీరేమి వ్రాయలేదు. అందుకు నేను

అసంతృప్తి చెందాను." అయ్యరుగారు విచారించారు. తాను కావాలని అలా చెయ్యక పోయినా, ఒక విష్కళంక హృదయుణ్ణి బాధ పెట్టినందుకు ఆయన బాధ పడ్డారు.

"నేను నిరుత్తరుణ్ణి అయ్యాను. నేనేదో కారణం చెప్పాను. ఆ కారణం నన్నే తృప్తిపరచనప్పుడు, చెట్టియారుని మాత్రం అది ఎలా తృప్తి పరుస్తుంది? కాని వెంటనే ఆయన ఆ విషయం మరిచిపోయారు ఆ మరునాడు మేము తమిళ సాహిత్య వైభవం గురించి మాట్లాడుతూ కాలక్షేపం చేశాము. నా పుస్తక ప్రతుల్ని ఇతరులకు అంద చెయ్యడంలో ఆయన తోడ్పడ్డారు. తమిళ సాహిత్య పరిశీలన మూలంగా కాలం గడిచిపోయింది ఆ తర్వాత నేను వెళ్ళిపోయాను.

తెలియకుండ మనం ఒకరికి అపకారం చేసినట్లయితే, ఆ అపకారం తొలగి పోయేందుకుగాను మూడుసార్లు క్షమాపణ కోరాలి. నేనూ అలాగే చేయదలచాను. నేను నా ఐంగురునూరు (1903) పరిష్కరణాన్ని ఆయనకి అంకితం చేశాను. నేను నా మదరాసు గృహానికి ఆయన పేరు పెట్టాను. కుంభకోణం కళాశాలలో బి.యే. చదివే విద్యార్థికి ఆయన పేరుతో ఒక ఉచిత విద్యావేతనం ఏర్పాటు చేశాను."

అయినా చెట్టియారు సజీవులై వుండగా, తానివేమీ చెయ్యలేకపోయినందుకు అయ్యరుగారు బాధ పడేవారు.

ఆ రోజుల్లో ప్రముఖ గాయకులలో ఒకరు మహావైద్యనాథ అయ్యరు. ఆయన జ్యేష్ఠ సోదరులు రామస్వామి అయ్యరు పెరియపురాణాన్ని ఒక యక్షగానంగా సంతరించారు. ఆ సోదరులిద్దరూ ఆ పాటలు పాడేవారు. మహావైద్యనాథ అయ్యరు ప్రతిభ నలుగురికీ చిరపరిచితం. అయ్యరుగారు ఆయనతో సన్నిహితంగా సంచ రించేవారు. ఆయనంటే అపారమైన అభిమానం ఏర్పడింది. ఆయన జీవిత చరిత్రను అయ్యరుగారు వ్రాశారు. అలాగే ఘనం కృష్ణయ్యరు జీవిత చరిత్రను కూడా ఆయన వ్రాశారు. ఆ రెండు జీవిత చరిత్రలను పురస్కరించుకుని మనం ఆ నాటి శాస్త్రీయ సంగీతపు స్థితిగతులు గ్రహించవచ్చు. గాయక-వాగ్గేయకారుడైన గోపాల కృష్ణభారతిని గురించి కూడా అయ్యరుగారు ఒక జీవిత చరిత్ర వ్రాశారు.

ఈ రచనలలో కూడా అయ్యరుగారి సునిశితమైన హాస్యం జాలువారింది. గోపాలకృష్ణ భారతి రచించిన నందనార్ చరిత్రం పట్ల అయ్యరుగారికి అంతులేని ఆదరభావం. అంత సుందరమూ, మధురమూ అయిన సంగీత రూపకం వ్రాసిన వ్యక్తి సుందరుడై ఉండవచ్చునని అయ్యరుగారి అభిప్రాయం. కాని మొదటిసారిగా

భారతిని కలుసుకున్నప్పుడు ఆయన కొంచెం ఆశాభంగం చెందారు. భారతీయారు మెడ చిన్నది, అందవికారమైన ముఖం, దొడ్డికాళ్ళు ఈ విషయాన్ని ఆయన జీవిత చరిత్రలో ఇలా పేర్కొన్నారు. "పెక్కు చోట్ల వంకరలుగా తిరిగి ఉండే పిల్లన గ్రోవి నుంచి ఎంత మధురమైన సంగీతం వెలువడుతున్నది. అలాగే అందవికార మైన ఆకృతి నుంచి మధుర గీతాలు వెలువడ్డాయి."

పుదుకోట దివానుగా ఉండిన శేషయ్య శాస్త్రి, పూండి అరంగనాథ మొదలి యారు, కె. వి. కృష్ణస్వామి అయ్యరు, సుబ్రహ్మణ్య భారతి ప్రభృతుల్ని గురించి అయ్యరుగారు జీవిత చరిత్రలు వెలయించారు. సాంప్రదాయిక కవిత్వం సంతరించినా అయ్యరుగారు భారతి ఆధునిక కవితను ఆదరించారు. మదరాసులో కాంగ్రెసు భవనంలో జరిగిన ఒక సభలో భారతిని గురించి ఉపన్యసించమని రాజాజీ అయ్యరు గారిని అర్థించారు. అప్పుడాయన భారతి కవితను గురించి అద్భుతంగా ఉపన్యసిం చారు. అంత్యోపన్యాసంలో రాజాజీ యిలా అన్నారు, "వశిష్ఠుడు విశ్వామిత్రుడ్ని బ్రహ్మర్షి అనడం వల్ల ఆయన కీర్తి అధికమైనట్లే, అయ్యరుగారి ప్రశంసా వాక్యాల వల్ల భారతి కీర్తి యినుమడించింది". ఛందోబద్ధమైన శృంఖలాల నుండి కవితకు భారతి విముక్తి ప్రసాదించడం వల్ల, ఆయన్ని కొందరు ఆ రోజుల్లో అకవి అని వ్యవహరించేవారు.

అయ్యరుగారి వచన రచన సరళసుందరంగా ఉంటుంది. కాని కవిత్వం విషయంలో సాంప్రదాయిక ఛందస్సుని విడిచి పెట్టలేకపోయారు. ఆయన వ్యాసాలను గాని, జీవిత చరిత్రలనుగాని చదువుతున్నప్పుడు నిఘంటువుని సంప్రదించ నవసరం లేదు.లోతైన నీరు తేటగా కనిపిస్తుంది. ఆయనవి చిన్న చిన్న వాక్యాలు.హృదయాం తరాళాలలోని భావాలను సముచితంగా అభివర్ణించేవారు. తాను అభివర్ణిస్తున్న వ్యక్తుల బాహ్యాకృతిని చిత్రించేటప్పుడు కూడా అశ్రద్ధ వహించేవారు కాదు. ఆయన తన గురువుని ఇలా అభివర్ణించారు:

"ఆయన్ని దర్శించగానే, ఆయనలోని వినయం, శాంతం, నిరాడంబరత్వం కనిపించేవి. అపారమైన విద్వత్తు, నిస్తులమైన భావనాశక్తి ఉన్నా, అలలు అణిగిన ప్రశాంతజలధివలె కనిపించేవారు. అపూర్వమైన ఆయన పాండిత్యాన్ని వెంటనే పసిగట్టలేము."

పిళ్లైగారి శివభక్తిని అయ్యరుగారు విపులంగా వర్ణించారు. ఆయనే ఒక శివభక్తుడు కాగా గురువుగారి యీ భక్తి పారమ్యాన్ని ఆయన ఉగ్గడించడంలో ఆశ్చర్యం లేదు ఇక పిళ్లైగారి కవితా రచన గురించి :

"ఆయనది ఎప్పుడూ ఆలోచించే స్వభావం. మొదట, ఆయన చెప్పదలచిన విషయాలను మనస్సులోనే అనుకునే వారు. ఆ తర్వాత పద్యాలు నిరాటంకంగా చెప్పేవారు. పూర్వం తాను వ్రాసిన పద్యాలనే యిప్పుడు ఒప్పగిస్తున్నారా అనే భావం శ్రోతకు కలుగుతుంది! మనస్సులోనే మధురభావనలన్నీ గుదిగ్రుచ్చబడేవి. తరువాత కొన్ని నిమిషాలలో ఆ మధురభావ స్రవంతి వెలువడేది; విద్యుద్వేగంతో వెలువడేది. యతి పెక్కు చోట్ల వచ్చే పద్యాలను ఆయన విరామగీతాలని పిలిచే వారు."

ఒక్కమాటలో, అయ్యరుగారు అవలంబించిన "త్రిగుణ" శైలివల్ల ఆయన వ్రాసిన జీవితచరిత్రలు తీర్చిదిద్దిన రచనలుగా కనిపిస్తాయి.

తమ వ్యాసాలకు అయ్యరుగారు అతికినట్లుగా శీర్షికలుంచేవారు. "రాలిన పూలు" ఇందుకు ఒక ఉదాహరణ. పత్తుప్పాట్టులోని ఒక భాగమైన కురింజిప్పాట్టు పూలు సేకరించే యిద్దరు పూబోడుల్ని గురించి అభివర్ణిస్తుంది. అందులో 99 పూల రకాలు పేర్కొనబడ్డాయి. కాని ఆయనవద్ద వున్న వ్రాతప్రతిలో అన్ని పూల రకాలు పేర్కొనబడలేదు. కొన్ని పాదాలు లోపించాయి. దీర్ఘాన్వేషణ తర్వాత, చివరికి ధర్మాపురం మఠం గ్రంథాలయంలో కొన్ని విడి విడి తాళదళాలలో లోపించిన పాదాలు కనిపించాయి. అవి మూడు పువ్వులే. కాని అవి లభించకపోవడంవల్ల కురింజిప్పాట్టు ప్రతి అసమగ్రంగా ఉంది లభ్యమైన పాదాలను సరి అయిన భాగాలలో ఉంచి, తనవద్దవున్న ప్రతికి సమగ్రత్వం సాధించారు. అందువల్ల ఆ వ్యాసానికి "రాలిన పూలు" అని పేరు పెట్టారు.

వ్యవహారంలో ఉన్న మాటలద్వారా తాను చెప్పదలచిన విషయాన్ని ఆయన స్పష్టంచేసేవారు. విద్యార్థి అయినా సరే పండితుడైనా సరే-అందరినీ అయ్యరుగారి శైలి అలరిస్తుంది. తమ అనుభవానికి అనుగుణంగా పాఠకులు ఆయన రచనలనుంచి రసాస్వాదన పొందేవారు.

అసమగ్రమైనా అయ్యరుగారి స్వీయ చరిత్ర బహు విషయ సంభరితం. అందులో రకరకాల వ్యక్తులు కనిపిస్తారు మనకు! ధనికులు, సజ్జనులు, దుర్జనులు,

నిర్వాహకులు—ఎందరెందరినో ఆయన అభివర్ణించారు. కాని వ్యక్తిలోని సుగుణాలే ఆయన్ని బహుధా ఆకర్షించాయి. అందువల్ల నా చరిత్రను ఉదారులూ ఉత్తములూ అయిన వ్యక్తుల ఉదంతాల సంకలన మనవచ్చు.

తమిళభాషను ఎంతగానో ప్రేమించినా తమిళభాషా సాహిత్యాలలోనే నిష్ణాతుడైనా, ఆయన సంకుచిత హృదయుడుకాదు. శుద్ధ ద్రావిడమనే మిషతో, ఆయన సంస్కృత శబ్దాలను పరిహరించలేదు. పరభాషా శబ్దాలను గ్రహించి ఒక భాష కాలక్రమాన పరిపుష్టం చెందుతుందని ఆయనకి తెలుసు. అయ్యరుగారి వచన రచనలో సంస్కృత శబ్దాలు తేట తమిళ శబ్దాలతో కలిసిపోయి ఒక ఉదాత్తమైన శైలికి దారి తీశాయి.

తమిళులకు తమ విలక్షణమైన చరిత్రను సంపాదించి యిచ్చిన అయ్యరుగారి పేరు పెంపులు ఎన్నటికీ తరగవు. సంగకాలపు కృతుల్ని వెలికి తీసి తమిళులకు సేవ చేశారు. ఆ తర్వాత ప్రముఖంగా చెప్పదగినవి ఆయన వచన రచనలు. అవి వచనంలో వెలసిన వర్ణచిత్రాలు; సాంస్కృతిక కోశాలు.

———

# అనుబంధం

ఆయ్యరుగారు పరిష్కరించిన గ్రంథాలు

1. జీవక చింతామణి
2. మణిమేకలై
3. పెరుంగదై
4. పత్తుప్పాట్టు
5. కురుంతొగై
6. ఐంగురు నూరు
7. పదిర్రుప్పత్తు
8. పరిపాడల్
9. పురనానూరు
10. నంబి తిరువిళైయాడల్
11. కుమర గురుపరర్ ప్రబంధంగళ్
12. మీనాక్షిసుందరంపిళ్ళై ప్రబంధంగళ్
13. శివక్కొళుందు దేశికర్ ప్రబంధంగళ్
14. సీకాళిక్కోవై
15. కప్పైళై క్కోవై

అయ్యరుగారు రచించిన వచన గ్రంథాలు

జీవిత చరిత్రలు

1. త్రిశిరపురం మహావిద్వాన్ మీనాక్షిసుందరంపిళ్ళై యవర్‌గళ్ చరిత్రం (రెండు భాగాలు)
2. విద్వాన్ త్యాగరాజచెట్టియార్
3. మహావైద్య నాథయ్యర్
4. ఘనం కృష్ణయ్యర్
5. గోపాలకృష్ణ భారతియార్
6. ఎన్ చరిత్రం

ఇతరములు

7. కణ్ణదుం కేట్టదుం (కన్నదీ విన్నదీ)
8. పుదియదుం పళైయదుం (కొత్తదీ పాతదీ)
9. నల్లురైక్కోవై (నాలుగు భాగాలు)
10. నినైవుమంజరి (స్మృతి మంజరి-రెండు భాగాలు)